# కిల్లాడి కిన్నెరిరాము





రచన:

సూరిశెట్టి సాంబశివరావ్ బాబ్జీ



ప్రజా ప్రచురణలు

పవరుపేట

ఏలూరు.

# కిల్లాడి కిన్నెరి రాము

మాంచాల రాజ్యాన్ని పరిపాలించే మహారాజు మదన సింహుడు మహా మంచి రాజు. తెల్లనివన్నీ పాలు, నల్లనివన్నీ నీళ్ళు అని నమ్మే వెర్రిబాగుల రాజు. ప్రజల కేలోటూ లేకుండా పరిపాలిస్తున్నాడు. పగలంతా రాజ్యకార్యాల్లో మునిగి, రాత్రుళ్ళు ప్రజలంతా తన గురించి యేమనుకుంటున్నారో తెలుసుకోవాలని రహస్యంగా మారు వేషంతో సంచారం చేస్తుండేవాడు. మంత్రిని వెంటబెట్టుకుని రోజూ రాత్రిపూట రకరకాల వింతల్నీ, విశేషాల్నీ చూస్తుండేవాడు.

ఇలా వుంటూండగా ఒకనాటి రాత్రి మామూలు ప్రకారం మహారాజు, మంత్రిని వెంటబెట్టుకుని మారు వేషాలతో వూళ్ళో వింతలు చూద్దామని బయలు దేరాడు. కూలీలు – రైతులూ వుండే చిన్న సందుగొందుల మురికి పేటల్లోబడి వాళ్ళిద్దరూ వెళ్ళిపోతూండగా, వీధిప్రక్క ఒక ఇంటిలో నుంచి యేవో మాటలు వినిపించాయి. ఏమిటో వినాలని మహారాజు కుతూహలంతో ఆ ఇంటి చాటున నక్కి నింపాదిగా తలుపు సందులోనుంచి తొంగి చూశాడు. ఇంట్లో దీపం వెలుగుతూంది. ముగ్గురక్కచెల్లెళ్ళు రాత్రి భోజనాలయ్యాక మంచంపై కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

అందరికన్నా పెద్దక్క అంది గదా,-"చెల్లెళ్లారా, మన కోరిక లేమిటో చెప్పుకుందాం. నాకు మహారాజుగారి వంటం వాడికి పెళ్లాం కావాలని వుంది. అలాగైతే నాకు తిండికి లోటుండదు. రాజుగారి వంటకాలన్నీ నా నోట్లోనే వుంటాయి."

రెండో అమ్మాయి వెంటనే అందుకుని,-"అలాగైతే నా కోరికకూడా చెప్తా వినండి. నాకు రాజుగారికి రోజూ భోజనాలు వడ్డించే వాణ్ణి పెళ్లాడాలని వుంది. అప్పుడు నాకు గొప్ప గొప్ప మేలైన భోజనమంతా నా వంతే!" అంది.

అప్పుడు ముగ్గురికన్న అందగత్తె-చక్కదనాల చుక్క తన అక్కలని చూస్తూ,-"అక్కయ్యలూ! ఇలాంటి చిన్న చిన్న కోరికలు కావు నావి. నా మనస్సెప్పుడూ గొప్ప గొప్ప కోరికలే కోర్తూ వుంటుంది; ఇవన్నీ వుత్తుత్త కోరికలే గనక నా కోరికేమిటో చెప్తా ఆలకించండి. నేనీ వూరి రాజు గారికి భార్యనై ఆయనొక్క తండ్రిని చెయ్యాలని వుంది. అలా పుట్టే కొడుకెలా వుంటాడో తెలుసా?—వాడి తల వెంట్రుక లొకవైపు బంగారు రంగుగాను మరొక ప్రక్క వెండిరంగుగాను వుండి మిలమిలా మెరిసిపోతూ వుంటాయి. బాబు యేడుస్తూంటే కళ్ల వెంట ముత్యాలు జలజలా రాలి పోతాయి. చిరునవ్వు నవ్వితే యెర్రని గులాబీ పువ్వులాగ కనిపిస్తాడు" అని చెప్పింది.

అబ్బో, ఈ అమ్మాయి చాలా ఘటికురాలి మోస్తరుగా వుందే అనుకున్నాడు, ఈ మాటలన్నీ తలుపుసందులోంచి వింటున్న మహారాజు. ఎలాగైనా ఆ ముగ్గురికి

చెల్లెళ్ళ కోరికలు తీర్చాలనే తలంపుతో మంత్రిని పిలిచి, "మంత్రీ! ఈ ఇంటిని బాగా గుర్తుంచుకో! రేపే ముగ్గురక్క చెల్లెళ్లనూ మన మహలుకి తీసుకు రావాలి!'' అంటూ ఆజ్ఞాపించాడు.

రాజుగారి ఆనతి ననుసరించి మంత్రి మర్నాడుదయం ఆ ముగ్గురక్క చెల్లెళ్లనూ తీసుకొచ్చి ఆస్థానంలో హాజరు పరచాడు. అప్పుడు మహారాజు వారిని చూసి, "అమ్మాయిలూ! మీరు ముగ్గురూ నిన్నరాత్రి యెంతో వుత్సాహంగా కోరుకున్న కోరికలుమీకు జ్ఞాపకం వున్నాయి గదా! అవేమిటో ఇప్పుడు నాకు చెప్పండి'' అన్నాడు.

అది వినే సరి కా ముగ్గు రక్క చెల్లెళ్ళు నిర్ఘాంత పోయారు. సిగ్గుతో తలలు దించేసుకున్నారు. అలా తల వంచుకున్న ఆఖరి అమ్మాయి చెక్కిళ్ళ అందం చూసి మహారాజు ముగ్ధుడైపోయాడు. ఏంచెప్తే సుల్తాను కెక్కడ కోపం ముంచుకొస్తుందోనని వాళ్ళు ముగ్గురూ తలొంచుకొని మౌనంగా వుండిపోయారు. అది కనిపెట్టి సుల్తాను వాళ్ళకు ధైర్యం చెప్తూ, - "అమ్మాయిలూ! మరేం భయపడకండి! మిమ్మల్ని దండించడాని కిక్కడికి రప్పించలేదు. మీరేం చెప్తారో కూడా నాకు తెలుసు'' అని చెప్పి, మూడో అమ్మాయివైపు చూసి, - "సుందరీ! నీ కోరిక యీనాడే ఫలిస్తుంది. నేటినుంచే నువ్వు నా భార్య వయ్యావు'' అని ఆమె చేతిని పట్టుకుని లాగి తన ప్రక్కను కూర్చోబెట్టుకున్నాడు. మిగతా యిద్ద రక్క చెల్లెళ్ళలోనూ ఒకర్ని వంటల వాడికి మరొకర్ని వడ్డనవాడికీ ఇచ్చి పెళ్లి ఏర్పాట్లు చేయించాడు.

రాణీగా మారిన అమాయకురాలు ఆఖరి అమ్మాయి వెంటనే మహారాజు పాదాలపై బడి, - "మన్నించండి. మహారాజా! ఏదో సరదాకని అలా అన్నానే గాని మీరు చేసిన యీ గౌరవానికి నేను అర్హురాలిని కాను; నన్ను క్షమించండి" అంటూ వేడుకుంది. మిగతా ఇద్దరూ అలాగే వేడుకోవాలని ముందుకొచ్చారు గాని అంతలో మహారాజు తన కోరిక ప్రకారం అలా జరిగితీరవలసిందేనని తీర్పు చెప్పాడు.

మహా వైభవంగా మహారాజు వివాహం జరిగింది. ఏదో కొద్దిలో వడ్డన వాడి పెళ్లైంది. అంతకన్న కొద్దిగా వంటవాడి పెళ్లైంది తమ చెల్లెలి కంత మహా వైభవంగా పెళ్ళికావడం చూడగానే మిగతా అక్కలిద్దరికీ బలే అసూయ కలిగింది. ఆమె కన్న పెద్దవాళ్ళ మేమిటీ? — అంతకన్న అధ్వాన్నంగా పెళ్ళి జరగడ మేమిటి అని వాళ్ళు మహా వుక్రోషం తెచ్చుకున్నారు. ఒకనా డక్క లిద్దరూ నీలాటి రేవులో కలుసుకున్నారు. అప్పుడు పెద్దక్క చిన్నదాన్ని చూచి, - "చెల్లీ! ఏం భాగ్యం పట్టిందే మన బుల్లి చెల్లికి; ఆ మహా రాజెక్కడ ఈ దరిద్రగొట్టు దెక్కడ - ఇంతకూ యే మంత అందంగా వుందని మహారాజు మోహించాడో నాకేం బోధపడడంలేదు. అదీ మన కళ్ళముందే పుట్టి పెరిగింది. దాని సంగతి మనకి తెలీదా? - అయినా నిజం చెప్పాలంటే నీ అంద చందాల ముందు అది నిలబడగలదా! నువ్వే ఆలోచించు. ఆ మహారాజుకి భార్య కావలసిన దానివి నువ్వు. ఆయన నిన్నే పెళ్లాడ వలసింది" అంటూ పొంగించింది.

ఆ మాటలకి ఉబ్బి తబ్బిబ్బై చిన్నక్క అంది గదా, "'నా పెళ్ళిమాటకేం గాని మహారాజంతటివాడు ఆ దిక్కుమాలిన గుంటని పెళ్ళాడాడే అని విచారిస్తున్నాను. అయినా ఫర్వాలేదు. దానికి తగ్గ ప్రతీకారం చేస్తాను. నేనే కాదు. మన మిద్దరం కలిసి దానికి గట్టిగా బుద్ధి చెప్పాలి. ''

ఇలా అక్కలిద్దరూ చిన్న చెల్లెలి కాపురం యెలా గయినా చెడగొట్టాలని యెన్నెన్నో పన్నాగాలు పన్నడం ప్రారంభించారు. కాని వాళ్ల పాచిక పారడంలేదు. అందుకని కిక్కురు మనకుండా వూరుకుని చెల్లెల్ని చూసినప్పుడల్లా యెంతో ఆనందంగా వున్నట్లు నటిస్తూ ఆమె మెచ్చుకునే మాటల్ని చెప్తూ వుండేవారు. చిన్నది పాపం యెంతో మంచి బాగులది; అందుకని వారి పొంగింపు మాటలకి లొంగకుండా యెప్పటి లాగునే నిరాడంబరంగా వుంటూ అక్కలంటే యెంతో మర్యాదగా ఆదరించేది.

పెళ్లైన మరికొన్ని నెలలకి రాణి గర్భవతి అయింది. ఈ వర్తమానం తెలియగానే మహారాజు పట్టరాని సంతోషంతో రాజ్యమంతా గొప్ప గొప్ప వేడుకలు జరిపించుకోమని చాటించాడు. ఈ అదను చూచుకొని అక్కలిద్దరూ నింపాదిగా చెల్లెలి దగ్గరకొచ్చి ఆనందంగా వున్నట్టు నటించి, మంత్రసానిపని తామే చేస్తామని అక్కడే, ఆ రాజ మహల్లో వుండిపోయేందుకు సందు చిక్కించుకున్నారు. ఇందుకు రాజూ రాణీకూడా అంగీకరించారు. వేరే మంత్రసాని ఇంకెవ్వరూ అక్కర్లేదని తీర్మానించు కున్నారు. దాంతో తమ పాచిక యిన్నాళ్ళకు పారింది గదా అని యెంతో ఆనందించారు అక్కలిద్దరూ- మహారాజు రాణికి కావలసిన

వన్నీ రప్పించి యిస్తూ యెంతో అనురాగంగా-కంటికి రెప్ప లాగ కాపాడుకుంటూ వస్తున్నాడు.

ఇలా వుండగా కొన్నాళ్ళకి రాణి ప్రసవించింది. సూర్య బింబం లాగ ప్రకాశించే అందాల బిడ్డణ్ణి కన్నది. ఆ అందాల రాశిని చూసి అక్కలిద్దరికీ కన్ను కుట్టింది. పసి పాప నొక గొంగళికిచుట్టి గంపలోపెట్టి మహారాణి మహలు ప్రక్కను పారుతున్న కాలువలో పారేశారు. ఎక్కడిదో చిన్న కుక్కపిల్లను చంపి తెచ్చిపెట్టి రాణి కుక్కపిల్లనే కన్న దని రాజుగారికి కబురంపారు. పాపం మ హా రా జు కీ మాయంతా యేం తెలుసు ?—తండ్రి నవుతానని ఉబలాట పడ్డాడు గాని ఆఖరి కిలా తారు మారవుతుందని కల్లోకూడా వూహించలేదు. ఈ సంగతి తెలియగానే మహారాజు కోప ముతో మండిపడుతూ మహారాణిని చంపేయాలని కత్తి యెత్తాడు. కాని మంత్రి అడ్డుపడి- "కోపగించకండి మహా రాజా! భగవంతు డిచ్చినదానికి ఆమె యేంచేస్తుంది చెప్పండి" అని నచ్చజెప్పి రాణి ప్రాణాలు కాపాడాడు.

కాలువలో పడ్డ పాపాయి గంపతోబాటు కొట్టుకు పోతూ కోటదాటి, పేటదాటి వూరవతల ఒక తోటలోబడి వెళ్ళిపోతూంది. ఆ తోట యజమాని అలా షికారుకని కాలువగట్టు కొచ్చాడు. అంతలో ఆ గంప కొట్టుకుపోతూ వుండడం చూసి గభాల్న ఆయన కాలువలోకి దూకి దాన్ని పట్టుకుని పైకి తెచ్చాడు. ఆ గంపలో వున్న పాపాయిని చూసి గంపెడంత ఆనందం పొందాడు.

పూర్వం ఆయన రాజుగారి తోటమాలిగా వుండే వాడు. ఎంతో విశ్వాసంగా పనిచేసి రాజుగారిని మెప్పించి

ఆ తోటను సంపాదించి దానికి యజమాని అయాడు. అంత ముసలివాడై పోయినా తమకు సంతానం లేదని అన్నాళ్ళూ యెంతో కృంగిపోయాడు. కాని ఆ వేళ అదృష్టంకొద్దీ పాపాయి దొరకడంతో భగవంతుడే పిల్లలు లేని తమకా చిట్టి తండ్రిని ప్రసాదించాడని పట్టరాని ఆనందం పొందాడు. ఆ ఫళంగా పాపని ఇంటికి తీసుకుపోయి తనభార్య చేతుల్లో పెట్టి, ఒసేవ్ చూశావా! భగవంతుడి లీలావిశేషం. మనకు బిడ్డలు లేరని ఆ పరమేశ్వరుడే యీ పాపని ప్రసాదించాడు. కన్న బిడ్డలాగ కాపాడుకో!" అన్నాడు.

ముసలితనంలో ముచ్చట గొలిపే చక్కని మురిపాల పాప దొరికినందు కాయన భార్యకూడా పరమానందపడి ఆ పాపకి భీముడని పేరుపెట్టి అల్లారుముద్దుగా పెంచుకోసాగింది. ఆ యానందంలో ముసలి దంపతు లిద్దరికి ఆ బిడ్డ యెవరిదీ, ఎక్కణ్ణుంచి కొట్టుకొచ్చిందీ అనే తలంపే రాలేదు.

ఇంకొక సంవత్సరం గడిచేక మహారాణి మరొక రాజ కుమారుణ్ణి కన్నది. చంద్రబింబంలాగ తళతళ మెరిసే ఆ చిట్టిపాపను కూడా అక్కలిద్దరూ నిర్దాక్షిణ్యంగా గంపలో వుంచు కాలువలోపడేసి, చచ్చిన పిల్లి కూనొకదాన్ని చెల్లెలి దగ్గర పెట్టి యీసారి పిల్లికూనే పుట్టిందని రాజుగారికి వర్త మానం పంపారు. అదృష్టవశాత్తూ గంపలో వున్న రెండో పాపాయి కూడా అదే తోట యజమానికి దొరికింది. యీ పాపను కూడా తన భార్య కిచ్చాడు. ఆవిడ యితనికి సోము డని పేరు పెట్టి పెద్దపిల్లవాడికన్న మురిపెంగా పెంచసాగింది. మహారాజుకీసారి మరీకోపంవచ్చింది. కాని మంత్రి మాటల్లో పెట్టి ఆ కోపాన్నెలాగో తగ్గించాడు.

మూడోసారి రాణి ఒక అందాల కుమార్తెను కన్నది. ఎంత అందముగా వుంటేమాత్రం ఏం ప్రయోజనం? ఆ యందాలపాపల్ని అల్లారుముద్దుగా పెంచుకునేభాగ్యం వారిని కన్నవారికి లేనప్పుడు;-పాపం రాజమహల్లో బంగారుతూగుటుయ్యాలల్లో తులతూగవలసిన ఈపాపగతికూడా ఇదివరకటిపిల్లల్లాగే అయింది. దుర్మార్గురాళ్లైనఅక్కలిద్దరూ తమచెల్లెల్ని మహారాజు వదిలేసేదాక నిద్రపోగూడ దనుకున్నారు. అందుకే యీ పిల్లనుకూడా కాలువపాలు జేసారు. భగవంతుడి విచిత్రమేమిటోగాని ఆఖరికి యీ పిల్లకూడా అదే తోట యజమానికి దొరికింది. ఆయన భార్య పిల్ల నందుకుని ఆమెకి "రాము" అని పేరుపెట్టి తత్తిమ్మా ఇద్దరు పిల్లలతోబాటు యెంతో ముద్దుగా పెంచుతూవుంది. ఐతే కపటవేషాలతో వున్న రాణి అక్కలిద్దరూ యీసారి ఒక కొరకంచు తీసుకొచ్చి చెల్లెలి దగ్గర పెట్టి, కొరకంచు పుట్టిందని రాజుగారికి వర్తమానం పంపించారు.

మూడోసారి కూడా యిలాంటి అపశకునపు కబురే రావడంతో మహారాజు మండిపడుతూ,-"ఛీఛీ! ఇలాంటి స్త్రీ నాకు భార్యగా వుండేందుకు తగదు. ఈమె నింకా బ్రతకనిచ్చినట్టయితే యీ పూరంతా పిశాచాలతో నిండి పోతుంది. అంతేగాకుండా ఈమె స్వయంగా పిశాచమే యేమో! అందుకే ఈమె నీ లోకంలో వుంచగూడదు" అని ఆమెకి మరణశిక్ష విధించాడు.

వెంటనే మంత్రీ మొదలైన వారంతా రాజుగారి పాదాలపైబడి యిలాంటి కఠినశిక్ష రద్దు చెయ్యాలని యెన్నో విధాల బ్రతిమాలుకున్నారు. "ప్రభూ! నేరాలు చేసినవారికే

మరణదండన గాని అమాయకులకు కాదు. మహారాణి నుమ్మారు విస్తారమైన కాన్పులైతే కన్నదిగాని ఇందులో ఆమె నేరమేముంది చెప్పండి. లోకంలో యెంతోమంది యెన్నోరకాల బిడ్డల్ని కంటున్నారు. అలాంటి వారిని చూసి జాలిపడాలి గాని, దండించడం తగునా ?-పోనీ ఆవిడ ముఖం మీరు చూడదలంచుకోకపోతే మానేయండి గాని ప్రాణం మాత్రం తీయించకండి తమ అనుగ్రహం తప్పిన తరువాత ఆమెకు కలిగే దుఃఖమే తగిన దండన. అందుకని కటాక్షించండి'' అంటూ వేడుకున్నారు.

అది విని మహారాజు మళ్లీ ఆలోచించాడు. రాణిని చంపించడం మంచిది కాదని నిశ్చయించుకున్నాడు. మరణ శిక్ష విధిస్తే ఒక్కసారే చచ్చి వూరుకుంటుంది, కానీ ఆమె రోజూ చచ్చేటట్లు చెయ్యాలని యిలా శాసించాడు. ''అయితే సరే, ఆమెకి విధించిన మరణదండన రద్దుచేస్తున్నాను. కాని వూరవతల నీలాటిరేవు దగ్గర కర్రతో ఒక చిన్న గోపురం కట్టించాలి. దానికి చుట్టూ కిటికీలు పెట్టించాలి.

''ఆ కిటికీలకు ఇనుపవూచలు పెట్టించాలి. దాంట్లోపల ముతక బట్టలతో ఆమెనుంచాలి. నీలాటి రేవుకొచ్చే పోయే ప్రతి ఆడది ఆమె ముఖంమీద వుమ్మివేసి పోవాలని వినికిడి చెయ్యండి. అలా ఉమ్మి వెయ్యకపోతే వారికికూడ ఆమె గతే పడుతుంది దీనికిక తిరుగులేదు. నేను చెప్పినట్టుగా వెంటనే నెరవేర్చండి'' అన్నాడు.

రాజుగారి ఆగ్రహం చూచి మంత్రికూడ మాట్లాడ లేక పోయినాడు. మహారాజు తలంచుకుంటే పనులకు కొదవా ?

మర్నాడే ఆయన కోరిన గోపురం తయారయింది. రాణిని దాంట్లో అసహ్యమైన స్థితిలో బంధించారు. అది చూసి అక్కలిద్దరూ 'అమ్మయ్యా! అని సంతృప్తిగా ఊపిరి పీల్చారు. పాపం రాణి పురుడు పోసుకున్న నెల్లాళ్లకే ఆ గోపురంలో బంధించబడి, ప్రజలచేత పడరాని అవమానాలు పొందింది. అయినా ఆమె తన దురదృష్టాన్ని తిట్టుకుని అవమానాలన్నిటిని సహించ సాగింది.

అక్కడ ఇద్దరు రాజకుమారులు భీముడూ, సోముడూ, రాజకుమార్తె రాము తోట యజమాని దంపతుల దగ్గర యెంతో గారాబంగా పెరిగి పెద్దవారయ్యారు. రాజకుమారి రాము పేరుకు తగ్గట్టు యెంతో ముచ్చటగా పెరిగింది. అందంలోనూ-బుద్ధి చాతుర్యంలోనూ ఆమె అందరికన్న మిన్నగా వుంది. వాళ్ల ముఖ వర్చస్సు చూస్తే యెవరో రాజకుటుంబం తాలూకు వాళ్ళని అర్థమవుతుంది. వాళ్లని చూసి తోట యజమాని దంపతులెంతో మురిసి పోతూండే వాళ్లు.

చదువుకునే యీడు వచ్చింది. అప్పుడు తోట యజమాని మంచి ఉపాధ్యాయుణ్ణి చూసి రాజకుమారు లిద్దరికి చదువు చెప్పించాడు. రాజకుమార్తె రాము కింకా చదువుకునే వయసు రాకపోయినా ఆమెకు చదువులోగల ఆసక్తి వల్ల అన్నయ్యల దగ్గరే చదువుకుంటూ వుండేది. అది చూసి తోట యజమాని వుపాధ్యాయుణ్ణి ఆమెకికూడా చదువు చెప్పమని కోరాడు. అప్పట్నుంచీ చదువుకుని కొన్నాళ్ళలోనే ఆమె తన అన్నల కన్న గొప్ప పండితురాలయింది.

అలా అన్నలూ - చెల్లెలూ- అన్ని శాస్త్రాలలోనూ ఆరితేరి అందర్నీ ఆశ్చర్య పరచసాగారు. గుఱ్ఱపుస్వారీ - యుద్ధపునేర్పూ అన్నీ నేర్చుకున్నారు. అది చూసి ఆతోట యజమాని దంపతుల ఆనందం యింకేమని చెప్పాలి?——

వాళ్ళకున్న దొక చిన్న యిల్లు. అదికూడా ఆ తోట లోనే వుంది. అందుకని ఆ తోట యజమాని తన పిల్లల కోసం వూరికి కొంతదూరంలో మంచిభవంతి ఒకదాన్ని కట్టించాడు. ఆ యింటి చుట్టూ మైదానం- పచ్చని పొలాలూ- రమణీయమైన పూదోటలు- ఎంతో చూడ చక్కగా వుంది. తోట యజమాని దంపతులు మంచి ముహూర్తం చూచుకుని ఆ భవంతిలోకి మకాం మార్చారు. ఆ భవనంముందు రాజుగారి అంతఃపురం కూడా యెందుకూ పనికిరానట్టుగా వుంది. భవంతి ముందున్న తోటల్లో- లేళ్ళూ - జింకలూ - ఆవులూ - మేకలూ - హంసలూ - బాతులూ గుంపులు గుంపులుగా వచ్చి ఆడుతూ ఆ రాజకుమారులకూ - రాకుమారికీ యెంతో ఆనందం కలిగిస్తూ వున్నాయి.

కాని ఈ ఆనందం యెన్నాళ్ళో లేదు. అనాథలుగా దొరికిన ఆ ముగ్గురు పసిపాపలనూ అల్లారుముద్దుగా పెంచి పెద్దచేసిన తోట యజమానీ, అతని భార్యా అకస్మాత్తుగా చచ్చిపోయారు. వారు పాపం అనుకోకుండా హఠాత్తుగా మరణించి నందువల్ల ఆ పిల్లల్ని పిలిచి ' మీ పుట్టుక లిలాంటివి బాబూ ' అని చెప్పడానికి వీల్లేక పోయింది. అందువల్ల ఆ పిల్లలకి అసలు రహస్యం తెలియక తోట యజమాని దంపతులనే తమ కన్న తల్లి దండ్రులుగా భావించి,

వారికి భక్తితో కర్మలన్నీ చేశారు. ఆ రహస్యం రహస్యంగానే వుండి పోయింది. కానైతే అనాథలుగా వున్న ఆ పిల్లలకు కావలసిన వన్నీ ఆ తోటలోనే అమర్చి పెట్టారు. తోట యజమాని దంపతులు వారి కేలోటూ లేకుండా చేశారు. వుండేందుకు చక్కని కుటీరం-కట్టుకుందుకు రమణీయమైన జల్తారు దుస్తులు-లోటు లేకుండా తినడానికి కమ్మని ఫలాలూ-భక్ష్యాలు-విహరించడానికి కనువిందైన తోటా-ఇక వారిం కెక్కడికీ వెళ్ల నవసరం లేకుండా సమస్త సౌఖ్యాలూ కూర్చిపెట్టి పోయారు. పాపం వారు ఆ తోట యజమాని దంపతులే తమ తల్లి దండ్రులని భావించుకుంటున్నారు. అందువల్ల వారి మరణాని కెంతో విచారించారు.

ఇలా వుంటూండగా ఒకనాడు భీముడూ-సోముడూ వేటకని అడవి కెళ్లారు. ఇంట్లో రాము మాత్రం వుంది. అప్పుడెవరో ముసలావిడ జపం చేసుకుంటూ వాకిట్లో కొచ్చి, "భవతీ భిక్షాం దేహి" అంటూ అరిచింది. ఆ యరుపు వినగానే అందాల రాము బయటికొచ్చి ఆ ముసలావిణ్ణి ఎంతో మర్యాదగా ఇంట్లోపలికి తీసుకెళ్లి కూర్చోబెట్టింది. ఆవిడకి పంచభక్ష్య పరమాన్నాలతో విందు భోజనం పెట్టింది. ముసలావిడ సుష్టుగా భోంచేసి కాస్సేపు జపం చేసుకుంది. జపం కాస్తా అయిపోగానే రాము ఆవిణ్ణి తమ తోటలోకి తీసుకెళ్లి అక్కడి మొక్కలూ-రంగు రంగుల పువ్వులూ-అందాల కొలనూ అన్నీ చూపించింది. వాటన్నిటినీ చూసి ఆ ముసలావిడ ఉప్పొంగి పోయింది.

"మీవంటి భక్తురాళ్ళ సావాసం లభించడం నాకెంతో ఆనందం. మీ కేదయినా లోటు కలిగితే మన్నిం చండి" అన్నది రాము యెంతో ప్రాధేయపూర్వకంగా-

"అలా అనకమ్మా-నువ్వు నాకేం లోటు చేశావని;- ఇంత మర్యాద నా జన్మలో యెన్నడూ యెరుగనంటే నమ్మ" అంటూ ఆ ముసలావిడ యింట్లో వుండే రకరకాల వింత వింత వస్తువు లన్నిటినీ విడ్డూరంగా చూడసాగింది. "ఆహా! ఎంచక్కా వుందమ్మా నీ యిల్లు-ఎంత సొంపుగా సింగారించావు!-ఇందులో వుండే సామాన్లన్నీ ఎంత విడ్డూ రంగా వున్నా యనుకున్నావు! ప్రపంచంలో కనీ వినీ యెరు గని యిన్ని అపురూప వస్తువుల్ని నీకెవరు తెచ్చిపెట్టారు తల్లి" అంటూ నిర్ఘాంతపోతూ అడిగిందా ముసలావిడ.

"ఇం కెవ్వరవ్వా-మానాన్నే- ఆయనిప్పుడు లేరు. ఆయనకు నేనంటే పంచప్రాణాలు, నేనడిగిందల్లా తెచ్చి యిస్తుండేవారు. అదెంత కష్టమైందయినా సరే, వెతికి వేసారి తీసుకొచ్చేవరకూ నిద్రపోయేవారు కాదంటే నమ్మ. పైపెచ్చు అంతకన్నా వీరులు మా అన్నయ్యలున్నారు సోముడూ-భీముడున్నూ. వాళ్ల కిలాంటి విచిత్ర వస్తువులంటే మరీ సరదా" అని చెప్పింది రాము.

"కానయితే ఆ ముసలావిడ కొంచెం తటపటాయిస్తూ "అమ్మాయ్! నీ కన్ని సుఖాలూ వున్నాయి. నీ తోట్లో అన్ని విడ్డూరాలూ వున్నాయి. నీ యింట్లో అన్ని వింత వస్తువులూ వున్నాయి. కాని మూడే మూడు వస్తువులు లేవమ్మా" అన్నది.

ఆ మూడు వస్తువులూ యేమిటన్నట్లు ప్రశ్నార్థకంగా ఆవిడవంక చూసింది రాము. మళ్ళీ ఆ ముసలావిడే అందు కుని, "మరేదీకాదు. జరిగిందీ, జరుగుతున్నదీ, జరుగ బోయేదీ చెప్పే అందాల రామచిలుక, అదొక విడ్డూరమైన పక్షి. అది పాడడం ప్రారంభిస్తే చాలు, తతిమ్మా పాడే పిట్టలన్నీ గబగబా పరుగెత్తుకొచ్చి దాంతో రాగం కలిపి కమ్మగా గానం చేస్తాయి. రెండోది పాడే చెట్టు. ఆ చెట్టు ఆకులన్నిటికీ నోళ్లుంటాయి. ఆ నోళ్ళు రక రకాల స్వరా లతో వినసొంపుగా కమ్మగా పాడ్తూవుంటే యెలాంటి వారైనా తన్మయులై తరించి పోతారు. మూడోది బంగారు నీళ్ళు. ఈ తోటలోనే చిన్న కుండీ కట్టించి దాంట్లో ఒక్క బొట్టు వేసినట్లయితే దాని నిండా బంగారు నీళ్ళు ఉవ్వెత్తున పొంగు కొస్తాయి. ఆ నీళ్ళన్నీ బంగారు రంగుతో మిలమిల మెరసి పోతాయి" అని చెప్పింది.

ఇవన్నీ వింటూ రాజకుమారి రాము మనసెంతో ఉవ్విళ్లూరింది. "హాయ్ హాయ్-బలేగా వున్నాయవ్వా, ఇంత వరకూ యిలాంటి విడ్డూరమైన వస్తువులు ప్రపంచంలో వుంటాయని నే నెన్నడూ ఆలకించలేదు. అయినా ఇంతకూ అవెక్కడుంటాయో చెప్పావు కాదే!" అని అడిగింది ఆతృతగా-

అప్పుడా ముసలావిడ చిరునవ్వు నవ్వుతూ, "తొం దర పడకమ్మాయ్! నువ్వు చెప్పమంటున్నావు కాబట్టి చెప్తున్నాను; ఈ మూడు వస్తువులూ ఈ రాజ్యం ఆవ తల చాలా దూరంలో వున్నాయి. అక్కడికి దారి మీ యింటి కెదురుగానే వుంది. నువ్వు పంపించే మనిషి ఇరవై

రోజులదాకా ఆ దారివెంట వెళ్ళేక అక్కడొక ఆసామీ అవుపిస్తాడు. ఆయన్నడిగితే యీ మూడువస్తువులూ యెక్కడున్నాయో చెప్తాడు" అని లేచి ఆమెదగ్గర సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయింది.

అప్పట్నుంచీ రాము మనసులో యేదో దిగులు పుట్టింది. ఆ మూడు వింత వస్తువుల్నీ యెలాగయినా సరే సంపాదించాలని వుబలాట పడింది. ఆ మూడూ దొరికితే యిక ప్రపంచంలో తనకి కావలసిన వింకేమీ వుండవనుకుంది. అయినా వాటిని పొందడం యెలా?- అదే విచారం పట్టుకున్నదామెను.

సాయంత్ర మయేసరికి అన్నలు భీముడూ, సోముడూ యింటికి తిరిగి వచ్చారు. కాని తమ చెల్లెలు రాము ఎప్పటిలాగా సంతోషంగా లేకపోవడం చూసి వారిద్దరూ కలవరపడ్డారు. పెద్దవాడు భీముడు ఆమె ప్రక్కన కూర్చుని, "ఏం చెల్లీ! యిలా వున్నావ్- రోజూ మేం వేటనుండి వచ్చేసరికి కిల కిల మంటూ ముందుకొచ్చి మాకు స్వాగతం చెప్పేదానివి కదా! ఈవేళ నీ ముఖంపైన యింతవిచారం తాండవిస్తున్న దేం?- నీ వొంట్లో బాగు లేదా?- నిన్నెవరయినా ఏమయినా అన్నారా?- వేగం చెప్పు! నీ విచారానికి కారణమేమిటో చెప్పు" అంటూ అడిగాడు.

అందుకు రాజకుమారి రాము కొంతసేపు మారు మాటాడలేదు. తర్వాత తన విచారాన్ని దిగమింగుకుని యిలా అన్నది. "అన్నలారా! నాకెలాంటి లోటూ ఇంతవరకూ మీరు కలిగించలేదు. నా వంటికి అనారోగ్యమూ

లేదు. నేను కోరిందల్లా మీరు సంపాదించి తెచ్చి యిస్తూనే వున్నారు. నేనిప్పుడు చెప్పేది మీ కంత గొప్ప కష్టమైన పనికాదు. నాకుమాత్రం గొప్పదే. అందుకే చెప్పలేక చెప్తు న్నాను. మన నాన్న నాకు కావలసిన వస్తువు లన్నిటినీ యేర్చి కూర్చి పెట్టాడని మీరన్నారు. నిజమేనని నమ్మి నేనూ యెంతో సంబర పడ్డాను. కాని మన యింట మూడు వస్తువులు మాత్రం లేవని ఈవేళే నాకు తెలిసింది. వాటిని కూడా యెలాగో లాగ సంపాదించామంటే యిక మన యిల్లు లాంటి యిల్లు ప్రపంచంలో యింకెక్కడా వుండబోదట. ఇంతకూ ఆ మూడువస్తువులు ఏమిటో తెలుసా?- మాట్లాడే రామచిలుక, పాడే చెట్టూ,- బంగారు నీళ్ళు. వీటి గురించి యెవరో ఒక ముసలి యోగిని నాకు చెప్పింది. అంతేకాదు, అవి యెక్కడుండేదీ, ఎలా దొరికేదీ కూడా ఆవిడ చెప్పింది. కాబట్టి మీ రవేవో చాలా అల్పమైన వస్తువులని వదిలి పెట్టక వాటిని నాకు తెచ్చిపెట్టారంటే నేనెంతో సంతో షిస్తాను. ఇంక నాకీ ప్రపంచంలో యేవీ అక్కర్లేదు—"

చెల్లెలి మాటలు విని పెద్దన్న భీము డన్నాడుగదా,- "చెల్లా ఈమాత్రం దానికే యెందుకింత విచారం?- నీ అన్నలు బ్రతికివుండగా నీ కేలోటూ రానివ్వను. ఆ వస్తువు లుండే చోటేదో- అక్కడికెళ్ళే దారేదో చెప్పు. రేపే నేను బయలుదేరి వెళ్తాను. అనుకున్న ఫలంగా నీకా మూడు విచిత్ర వస్తువులూ అందించేపూచీ నాది— "

కానయితే యిందుకు చిన్న అన్నయ్య సోముడు మరీ ఉరకుతూ ముందుకొచ్చాడు. కాని భీము డతణ్ణి ఆపి, "తమ్ముడా! నీ వుద్దేశం నా కర్థమయింది. నువ్వు వెళ్ళినా

ఆ కార్యం యిట్టే సాధించుకు రాగలవు. అందు కనుమానం ఆవగింజంతయినా లేదు. కాని పెద్దవాణ్ణి నేనే ముందు వెళ్ళి కార్యం సాధించుకు రావాలి ” అని తన ప్రయాణానికి తగు సన్నాహాలన్నీ జరిపించాడు. ముసలి యోగిని చెప్పిన సంగతులన్నీ అతను చెల్లెలద్వారా తెలుసుకున్నాడు.

మర్నాడుదయం భీముడు తన సామానుతో యింటి నుంచి బయలుదేరాడు. ముందుగా చెల్లెలు రాము వద్దకెళ్ళి ఆమెని ప్రేమార కౌగలించుకొన్నాడు. ఆమె క్షేమంగా వెళ్లి రమ్మన్నదే కాని అన్నను చూసి వలవలా కన్నీరు కార్చింది. పుట్టింది లగాయితు యింతవరకూ అన్నలను వదలి పెట్టి ఒక్కనాడూ వుండలేదు “అన్నయ్యా! ఎందుకొచ్చిన గందరగోళం - మన కా వస్తువులూ వద్దు - యేమీ వద్దు. నువ్వీ ప్రయాణం మానుకో! చూస్తూ చూస్తూ అగ్గిలో దూకడం యెందుకు?” అని చెప్పింది రాము.

కాని పెద్దవాడూ - అన్నీ తెలిసినవాడూ అయిన పరాక్రమశాలి భీముడంత మీదుమీదుగా ఒప్పుకుంటాడా? చిన్న నవ్వు నవ్వుతూ చెల్లెల్ని బుజ్జగిస్తూ అతను తన జేబులో నుంచి చిన్న కత్తి తీసి ఆమె కందించాడు. “చెల్లీ! దీన్ని నీ దగ్గరే భద్రంగా వుంచుకో. ఎప్పుడు నేను తలంపు కొస్తే అప్పుడు దీన్ని పైకి తీసి చూడు. ఇప్పటిలాగే యిది తళతళ మెరిస్తే నేను బ్రతికే వున్నాననుకో. లేకపోతే కత్తినిండా రక్తపు మరకలు కనిపిస్తే నేను చచ్చిపోయానసనుకుని, నాకు చేయవలసిన కర్మలన్నీ చేయుండి” అని చెప్పాడు.

ఇలా చెప్పి భీముడు తన చెల్లెలి దగ్గర తమ్ముడు దగ్గర సెలవు పుచ్చుకొని సామానుతోబాటు గుఱ్ఱం యెక్కి

వెళ్లిపోయాడు. యోగిని చెప్పిన దారివెంట కుడి పక్కగాని, యెడం పక్కగాని దిక్కులు చూడకుండా ముక్కుకు సూటిగా బయలుదేరి వెళ్లాడు. అలా యేకబిగిని యిరవై పగళ్లూ-రాత్రులు వెళ్ళగా, యిరవై యొకటోనాడుదయం దార్లో యెవరో భయంకరమైన యోగి ఒకాయన కనిపించాడు. ఆయనను చూసి చటుక్కున ఆగిపోయాడు భీముడు. ఆ యోగి ఒక చెట్టుక్రింద కూర్చుని జపం చేసుకుంటున్నాడు. దగ్గర లోనే ఒక చిన్న పూరిల్లుంది. వర్షం పడేటప్పుడా యోగి తలదాచుకునే యిల్లేమో అది !.

యోగిని చూస్తుంటే యెంత భయంకరంగా వున్నాడను కున్నారు! కనుబొమలు రెండూ మంచులాగ తెల్లగా వున్నాయి. తలవెంట్రుకలయితే నల్లగానే వున్నాయి. మీసం పెరిగి నోరు చుట్టూ తిరిగింది. చేతులకూ కాళ్ళకూ వున్న గోళ్ళు చాలా పొడుగ్గా పెరిగి భూమి నంటుతున్నాయి. ఆయనకు బట్టలు లేవు గాని ఒక చాప మాత్రం నడుంకి చుట్టుకున్నాడు. ఇదీ ఆ యోగి తాలూకు అవతారం! ఆయన జీవితంపై విరక్తిజెంది ఎన్నో సంవత్సరాలనుంచి అక్కడే కూర్చుని తపస్సు చేసుకుంటున్నాడు.

యోగిని చెప్పిన ప్రకారం భీముడు గబుక్కున గుఱ్ఱం దిగాడు. సన్యాసి దగ్గర కెళ్లాడు. తనకు మొట్టమొదట కనిపించిన వాడు ఆయనేగా మరి! అందుకని భీముడాయనకు సాష్టాంగ నమస్కారం చేశాడు. అందుకా యోగికూడా అతన్ని దీవిస్తూ యేవేవో అన్నాడు గాని ఆయన మీసం నోటిచుట్టూ చుట్టుకుని వుండటంవల్ల యేమాటా సరిగ్గా బోధపడలేదు. అయినా యెలాగయినా సరే ఆ యోగి ఏం

చెప్తాడో విని వెళ్లాలనే పట్టుదలతో తన సంచిలోనుంచి కత్తెర పైకితీసి సన్యాసి అనుమతి తీసుకుని ఆయన మీసం చాలా వరకు కత్తిరించి వేశాడు. అప్పుడాయన ముఖంలో మంచి కళ పుట్టిపడింది. ముసలితనం మచ్చుకయినా కనిపించలేదు. "ఆహా! ఎంత కళగా వున్నారండీ యిప్పుడు! నా దగ్గరే గాని అద్దముంటే యీ పాటికి మీ అందాన్నంతా దాంట్లో చూపించేవాణ్ని. మీరు మనిషిగా వున్నారంటే నమ్మండి" అన్నాడు. భీముడు చేసిన మంచిపనికి ఆ యోగి ఎంతో మెచ్చుకుని, ఎవరవు నాయనా నువ్వు. నువ్వుచేసిన యీ మంచిపని యెన్నడూ మరచిపోలేను, ఏదో పనిమీద వెళ్తు న్నట్టుంది. ఏమిటాపని?— నీ కేంకావాలో వెంటనే కోరుకో అన్నాడు.

అప్పుడు భీముడు, "స్వామీ"! నేనుబహుదూరంనుంచి వచ్చాను. మాట్లాడే రామచిలుక- పాడే చెట్టు- బంగారు నీళ్ళు ఎక్కడ దొరుకుతాయో అని వెతుక్కుంటూ వస్తున్నాను."

"అవి యిక్కడికి దగ్గరగానే వున్నాయని తెలుసు కాని యెక్కడ వున్నాయో సరిగ్గా తెలియదు. మీకు తెలిస్తే దయచేసి ఎటువెళ్లాలో నాకు దోవ చూపించండి స్వామీ!" అంటూ ప్రాధేయపూర్వకంగా బ్రతిమాలుకున్నాడు.

ఈ మాటలు వినగానే, అదేం విడ్డూరమో మరి, ఆ సన్యాసి గబుక్కున తలదించివేసుకున్నాడు, ముఖమంతా పాలిపోయింది. నోటివెంట ఒక్క మాటకూడా రాలేదు. అప్పుడు భీముడు మళ్లీ అందుకుని, "స్వామీ! నేను చెప్పింది

విన్నారా ?-మీ కా సంగతి తెలిస్తే నాకు దయచేసి త్వరగా చెప్పండి. లేకపోతే మరెక్కడికైనా వెళ్లి తెలుసుకుని వస్తాను" అన్నాడు.

మరికొంత సేపటి కా యోగి భీముణ్ణి చూస్తూ- "నాయనా! నువ్వడిగే వస్తువులుండేచోటు నాకు తెలుసు. కాని నిన్ను చూడగానే యెందుకో యెనలేని జాలి కలుగు తూంది. నువ్వుచేసిన వుపకారంవల్ల అది మరీ యెక్కువయింది. అందుకని ఆ చోటు చెప్పడానికి నాకు మనస్కరించడం లేదు. ఆ మార్గం చాలా కష్టమైంది బాబూ! నీలాగే ఇదివర కెంద రెందరో పెద్దమనుషులీ దారివెంట వచ్చి, ఇప్పుడు నువ్వడిగి నట్టే అడిగారు; ఆ పనికి పూనుకోవద్దని నే నెంతచెప్పినా వినలేదు. ఆఖరికి వారు పెట్టిన నిర్బంధానికి తాళలేక నేనా దారి చూపించవలసివచ్చింది. అలా వెళ్లినవారంతా నాశ నమై పోయారేగాని, ఒక్కరూ యింతవరకూ తిరిగిరాలేదు. నీకు ప్రాణాలపైని ఆశ అన్నదివుంటే ఈ ప్రయత్నం మాను కుని యింటికి తిరిగిపో! అని చెప్పాడు.

అందుకు భీముడు కించిత్తూ చలించలేదు. "స్వామీ! మీ కా భయం అక్కర్లేదు. మా చెల్లెలి కోరిక ప్రకారం నేను ఆ మూడు వస్తువులు తెచ్చేవరకూ మళ్లీ యింటి గడప తొక్కనని మాట యిచ్చాను. నే నేమయినా ఫర్వాలేదు. కాని నాముద్దుల చెల్లెలి కోరిక తీరాలి. అందుకని మీరు వెనుదీయకుండా చెప్పండి" అంటూ వేడుకున్నాడు.

భీముడిక యెంత చెప్పినా వినిపించుకునే రకం కాదని తెలుసుకుని ఆ యోగి ఇలా అన్నాడు. "నే నెంత చెప్పినా

నువ్వు వినిపించుకోవడం లేదు ఏం చేస్తాను. నీ కర్మ ఇదుగో! ఈ గుండు తీసుకో-గుఱ్ఱంపై నెక్కి యీ గుండుని ముందుకి విసిరావంటే అది తిన్నగా దొర్లిపోతుంది. నువ్వు దాని వెనకగుండా కొంతదూరం వెళ్ళావంటే పెద్ద పర్వత మొకటి కనిపిస్తుంది. ఆ గుండు నిలిచిపోయినచోట నువ్వూ ఆగి, గుఱ్ఱం దిగి ఆ కొండ నెక్కావంటే, ఒకచోట పెద్ద గుహ కనిపిస్తుంది. ఆ గుహ ద్వారం దగ్గర పెద్ద రాయి ఒకటి పడి వుంటుంది. దాన్ని మెత్తగలిగావంటే దాని క్రింద యేముందోచూడు అలా ఆ బండరాతిని పైకెత్తుతూంటె వెనకనుంచి రకరకాల భయంకరమైన అరపులు వినిపిస్తాయి. వాటినివిని నువ్వు వెనక్కిగాని, అటూయిటూగాని చూశా వంటే నువ్వుకూడా ఒక చిన్న నల్లరాయిగా మారిపోతావు. ఆ కొండపైనుండే నల్లరాళ్లన్నీ యిలా మారిపోయిన మానవులే! ఆబండరాతి క్రింద యేదిదొరికితే దాన్ని పట్టుకొని గుహలో ధైర్యంగా ప్రయాణం సాగించు. కొంతదూరం అలా వెళ్లేసరికి సాలెపురుగు లాగ ఒకదానిపై నొకటి అల్లుకుని వున్న చిన్నచిన్న కొండలరాజ్యం కనిపిస్తుంది. అక్కడ రాజ్యమేలుతున్న నొక అడవిపంది. అది మనుషుల్నితింటూ నానా యిబ్బంది పెడ్తుంటుంది దాన్ని నీ సాహస పరాక్రమాలతో చంపగలిగావంటే అక్కడిప్రజలు నిన్నెంతో ఆదరిస్తారు; ముందు చేయవలసిన కార్యం వారేచెప్తారు. వెళ్ళు. నాయనా!" అంటూ వీడ్కోలుచెప్పాడు యోగి.

భీముడు టంచనుగా గుఱ్ఱంపైకెక్కి యోగి యిచ్చిన గుండును క్రిందికి విసిరాడు. అది దొర్లుతూ ముందుకెళ్లిపో సాగింది. దానివెంట భీముడు స్వారీచేసుకుంటూ బయల్దే

రాడు. కొంతదూరము వెళ్లేసరికి యోగిచెప్పినట్లు ఒక మహా పర్వతందగ్గర ఆగుండు నిలిచిపోయింది. అదిచూసి రాకుమారుడు భీముడు గబుక్కున గుఱ్ఱం దిగి కళ్లెం దాని మెడ మీదనే వుంచి ఆ పర్వతం యెక్కడం ప్రారంభించాడు. పర్వతంపైని యెన్నెన్నో నల్లరాళ్లు పడివుండడం చూసి అతనికి యోగి చెప్పిన మాటలు జ్ఞాపకంవచ్చాయి. దాంతో అతనిలో యేదో పిరికి జబ్బు కాస్త ప్రవేశించినట్లయింది. అయినా వెంటనే తన చెల్లెలికీ, యోగికీ యిచ్చినమాట తలంపుకొచ్చింది. వెంటనే భీముడు ధైర్యంగా ముందుకు సాగిపోయాడు. కొంతసేపటికొక గుహ కనిపించింది; దానికి ద్వారమేదీలేదు గాని ఒక పెద్దబండరాయిమాత్రం మధ్యగా పడివుంది. దాన్ని యెత్తడానికతను యెంతో తంటాలు పడ్డాడు. అలా గంటలకొద్దీ తన బలం చూపించి ప్రయత్నించాడు.

అంతలో నాలుగు వైపులనుంచీ రకరకాల భయంకరమయిన అరుపులు వినిపించాయి. పాపం అతను పరాకుగా వున్నాడేమో, గబుక్కున ఆ యరుపులు వచ్చేవైపుకి తిరిగి తిరిగి చూశాడు. ఇంకేముంది?–మరుక్షణంలో అతనొక నల్లరాయిగా మారి పర్వతంపై నుంచి దొర్లి క్రిందను పడిపోయాడు. పాపం భీముడు తలంచుకున్న దొకటీ–జరిగింది మరొకటీ; – ఆ పర్వతంపై నున్న నల్లరాళ్ళలో ఒక రాయిగా పడిపోయాడు భీముడు.

ఇలా వుండగా అక్కడ రాము, సోముడు తాలూకు సంగతి కూడా ఆలోచించుదాం. పెద్దన్న భీముడు యిల్లు వదిలి అప్పుడే ఆరెన్నెల్లు గడిచిపోయాయి. కాని యెంతకూ

అన్న తిరిగి రాకపోవడంతో రాముకి అనుమానం కలిగింది. అన్న తనకిచ్చి పోయిన కత్తి అంతవరకూ ఆమె నడికట్టునే వుంది. అందుకని పెద్దన్న బ్రతికే వున్నాడో-లేకపోతే యేదయినా అపాయంలో పడ్డాడో యేమిటో చూద్దాం గదా అని ఆమె ఆ కత్తిని ఒరలోనుంచి పైకి తీసి చూసింది. ఇంకేముంది?- ఆ కత్తి రక్తపు చుక్కలతో పూర్తిగా తడిసి పోయివుంది. అది చూడగానే అన్నా-చెల్లెళ్ళిద్దరికీ గుండె గుభేలు మన్నది. ప్రాణం పోయేంత పనయింది. ఆ రోజల్లా పాపం వారిద్దరూ అన్నను తలంచుకుని కేరు కేరుమని యేడుస్తూ వలవలా కన్నీటి కాలువలు కార్చారు. అయినా యెంత యేడిస్తే మాత్రం పోయిన అన్నయ్య మళ్ళీ బ్రతికి వస్తాడా!

ఆ ఫళంగా రాము ఆ కత్తిని క్రింద పారవేసింది. "అయ్యో! ఎంతపని చేశాను పెద్దన్నా! నాకుడిభుజం పోయి నట్టయింది!—ఇక నేను మళ్లీ చూడలేను. ఎంత దురదృష్ట వంతురాల్ని అన్నయ్యా! - మాట్లాడే రామచిలుక - పాడే చెట్టు - బంగారు నీళ్ళ గురించి నీతో యెందుకు చెప్పాను! ఆ దిక్కుమాలిన ముసల్ది మనింటికే యెందుకు రావాలి?— ఆ మూడువస్తువు లుంటేనేం-లేకపోతే నేం? — మాయలాడి మాట లాలకించి నిష్కారణంగా నీ నిండుప్రాణాలు తీశానే అన్నయ్యా!" అంటూ పరి పరి విధాలుగా పరితపించింది చిన్నారి రాము.

అప్పుడు సోముడామెను ఓదార్చి,-"చెల్లీ! మనఅన్న గురించి యిప్పుడెంత దుఃఖించినా యేం ప్రయోజనం చెప్పు. చచ్చిపోయిన వాళ్ళెక్కడయినా మళ్లీ తిరిగి రాగలరా!—

అదంతా దైవమాయ. ఇంత జరుగుతుందని మనం ముందు ఆలోచించుకోకుండా అన్నను పంపించడం మనది బుద్ధి పొరపాటు. అయితే ముసలావిడేమో నీతో చెప్పిన మూడు వస్తువులూ లోకంలో లేనివికావు. నిజంగావున్నవే— అలాంటప్పుడామెనని యేం లాభం? మన అన్న యేదో తప్పయినా చేసి వుండాలి; లేకపోతే దైవవశాత్తూ మరేదయినా జరిగివుండాలి. ఇలాంటి ఆపద సమయాల్లోనే మనం ధైర్యం వహించి వుండాలని అమ్మా-నాన్నా చెప్పినమాట అప్పుడే మరచిపోయావా చెల్లీ- అన్నకు పట్టినగతి తమ్ముడికి కూడా పడుతుందని యెక్కడుంది?- అందుకని నేనువెళ్ళి ఆ మూడు వింత వస్తువుల్నీ పట్టుకొస్తాను. రేపే బయలుదేర్తాను" అన్నాడు.

ఈ మాట వినేసరికి అందాల రాము గుండెల్లో రైళ్లు పరుగెత్తాయి. "అమ్మయ్యో! మళ్ళీ నువ్వు కూడానా అన్నయ్యా- ఒక అన్న నప్పుడే పోగొట్టుకున్నాను. నువ్వు కూడా ఆ దిక్కుమాలిన వస్తువులకోసం ఆహుతి అయిపోయావంటే నేనీ లోకంలో యిక దిక్కులేని అనాధనై పోవలసిందే!" అంటూ భోరుమని యేడ్చిందామె కాని సోము డెంతకూ వినిపించుకోలేదు. చెల్లెలి సరదా తీర్చకపోయిన అన్న ఉన్నా ఒకటే - లేకపోయినా ఒకటే ననుకున్నాడు. మానుకోవడమేమిటి? వెంటనే వున్నపాటున బయల్దేరాడు కూడాను;- వెళ్ళేటప్పుడతను చెల్లెలి కొక ముత్యాలహారం యిచ్చాడు.— "ఇదిగో చూడు చెల్లీ! ఈ ముత్యాలహారములో సరిగ్గా వంద ముత్యాలున్నాయి. ఈ ముత్యాలను నువ్వెప్పుడు లెక్కపెట్టినా సరిగ్గా వంద వుంటే నేను బ్రతికే

వున్నాననీ, యే వొక్కటి తగ్గిపోయినా నాకూ అన్న గ
పట్టిందనీ అనుకో. అయినా నువ్వు ధైర్యంగా వున్నావంటే నా కేయాపదా రాదు, మనిద్దరం మళ్ళీ కలుసుకుని ఆనంద ముగా అంచక్కా వుందాం'' అని ధైర్యంచెప్పి గుఱ్ఱంపైని పయనమయ్యాడు సోముడు.

అలా అతను యిరవైరోజులు అరణ్యాలు దాటి వెళ్ళగా వెళ్ళగా అతని కిదివరకటి మీసాల గెడ్డాల సన్యాసే మళ్లీ యెదురయ్యాడు. ఆయనకి నమస్కరించి సోముడు తను బయలుదేరిన పనేమిటో విన్నవించి, మాట్లాడే రామచిలుక-పాడేచెట్టు - బంగారునీళ్ళు ఎక్కడ దొరుకుతాయో తెలియ జెప్పమని అడిగాడు. అప్పుడా సన్యాసి అన్నాడుగదా, ''నాయనా! కొన్నాళ్ళక్రిందట నీలాంటివాడే ఒక డిలాగే అడిగాడు. వద్దుబాబూ! వాటికోసం తాపత్రయపడక వెనక్కి తిరిగి పొమ్మని యెంత చెప్పినా విన్నాడుకాడు. వాడి బల వంతంమీద అక్కడికి చేసుకునే వుపాయం దారీ చెప్పి పంపాను కాని వా డింతవరకూ తిరిగి వచ్చినట్టు కనిపించదు. అంతకుముందు వెళ్ళినవాళ్ళ గతే వాడికీపట్టింది. అందరితో బాటు నల్లరాయిగా మారిపోయాడు. నువ్వు వెళ్ళినా నీ గతికూడా అంతే అవుతుంది. అందుకని నా మాట విని యీ ప్రయత్నం మానుకో. ఇంటికి తిరిగిపోయి నాలుగు కాలాలపాటు హాయిగా వుండు''—

కాని సోముడికీ మాట లేపీ రుచించలేదు. ఆ మూడూ వస్తువులూ సంపాదించే ఉపాయ మేమిటో చెప్పమని సన్యాసి నడిగాడు. అప్పుడా సన్యాసి లోగడ భీముడికి చెప్పినట్లే అక్కడికెళ్లే దారి చెప్పాడు. వెంటనే సోముడు గుఱ్ఱం దిగి

న్యాసి సంచిలో నున్న నల్లగుళ్లలో ఒక గుండు పైకి తీశాడు. సన్యాసి చెప్పినదంతా శ్రద్ధగా విని ముందా గుండు విసిరి అది వెళ్తున్నవైపు గుఱ్ఱంపైని చకచకా సాగి పోయాడు.

చాన్నాళ్ళకా నల్లగుండు ఒక పర్వతం దగ్గరకెళ్లి ఆగిపోయింది. సోముడుకూడా అక్కడ ఆగి గుఱ్ఱాన్ని ఒక చెట్టుకి కట్టి ధైర్యంగా కొండ యెక్కడం ప్రారంభించాడు. కొంతదూరం యెక్కేసరి కతనికి యేవేవో భయంకరమైన అరుపులూ, తిట్లూ వెనకనుంచి వినిపించాయి. అయినా సన్యాసి చెప్పిన మాటలు జ్ఞాపకం వున్నాయిగామరి ! అందు కని ససేమిరా వాటిని వినిపించుకోకుండా ముందుకి నడచి వెళ్లడం మొదలెట్టాడు. కాని మరికొంత సేపటికి వెనకనుంచి చిన్నచిన్న గులకరాళ్ళు గబగబా వచ్చి అతని తల పగిలి పోయేటట్టు కొట్టడం ప్రారంభించాయి. దాంతో సోముడు కోపం పట్టలేకపోయాడు. 'ఎవడ్రా వెధవ ?' అనుకుంటూ గుడ్లురుముతూ వెనక్కి తిరిగి చూచాడు. ఇంకేముంది? అలా వెనక్కి తిరగడంతోనే నల్లరాతిగా మారిపోయి జరజరా క్రిందికి దొర్లిపోయాడు. పాపం అతనికికూడా తన అన్నగతే సంప్రాప్తమయింది.

—ఇక్కడ యింట్లో రాజకుమారి రాము తన చిన్నన్న యిల్లు వదలి వెళ్ళింది మొదలుకుని ప్రతిరోజూ తనకు సావకాశం చిక్కినప్పుడల్లా అతనిచ్చిన ముత్యాల హారం పైకి తీసి ఒక్కొక్కపూసే జాగ్రత్తగా లెక్కపెట్టు కుంటూ వుండేది. అంతేకాదు రాత్రి పడుకునేముందుకూడా ఒకమారు లెక్కపెట్టుకుని ఆ హారాన్ని తన మెడలోనే వేసు

కుని మరీ నిద్రపోయేది. మళ్ళీ మర్నాడు లేవగానే ఆ హారాన్ని చూసుకునేది.

కాని ఈవేళ ఆమె ముత్యాలహారం తీసి లెక్కపెట్టుకునేసరికి అందులో రెండు ముత్యాలు తక్కువయిపోయాయి. ఆమె గాబరాపడి మళ్ళీ లెక్కపెట్టింది. పూసలు తక్కువగానే వున్నాయి. పాపం రాము హృదయం ఆ దృశ్యం చూసి తల్లడిల్లిపోయింది. చిన్నన్నకూడా పెద్దన్నయ్యలాగే చచ్చిపోయాడని నిర్ధారణ చేసుకుని గోలు గోలుమని యేడ్చింది. అలా యెంతసేపు యేడుస్తూ తెలివితప్పి వుండిపోయిందో తెలియదు.

మర్నాడు లేచి చూసేసరికి రాజకుమారి రాము యెదురుగుండా ఆమె తల్లిదండ్రులైన తోటమాలి దంపతుల ఫోటోలు కనిపించాయి. పాపం రాముకి వెక్కిళ్ళుమాత్రం మిగిలాయి. కాని యేడ్చేందుకు కళ్ళల్లో ఒక్క బొట్టు నీరు కూడా లేదు. అంతా ఆవ్చుకుని పోయింది. ఆమె చాల సేపు తదేక ధ్యానంగా తల్లిదండ్రుల ఫోటోలవైపు "ఇంకేం చెయ్యడం— దిక్కులేని అనాధనై పోయాను" అన్నట్టుగా చూసింది

అలాచూస్తూవుండగా కొంతసేపటి కామెలో ఏదోఒక విచిత్రమయిన గుండెనిబ్బరం కలిగింది. ఎక్కడా లేనిధైర్యం పుట్టుకొచ్చింది. వెంటనె ఆమె తన కళ్ళనీళ్ళు తుడుచుకుంది తల్లిదండ్రులకు భక్తిపూర్వకంగా నమస్కరించింది. ఆడదైతే మాత్రం తను అబలను కాదని లోకానికి నిరూపించుకోవాలని నిశ్చయించుకుంది. తన అన్నలమాదిరిగా ఆహుతైనా

అయిపోవాలి లేదా ఆమూడు విడ్డూరమైన వస్తువుల్ని సాధిం చుకు రానైన రావాలనుకుంది.

అనుకున్నదే తడవుగా రాజకుమారి రాము తన దుస్తుల్ని మార్చుకుని, మగదుస్తుల్ని వేసుకుని వెంటనే గుఱ్ఱ మెక్కి బయలుదేరింది. ఆమె ఇదివరకే గుఱ్ఱపుస్వారీ, వేటా డటం మొదలైన విద్యల్లో ఆరితేరి వున్నందువల్ల యెంత దూరం వెళ్ళినా రాముకి అలసట అనిపించలేదు. ఇరవయ్యో రోజున ఆమెకికూడా భీముడుకి, సోముడుకి కనిపించిన భయం కరమైన సన్యాసి కనిపించాడు. రాము గభాల్న గుఱ్ఱందిగి ఆయనదగ్గరకెళ్ళి కూర్చుని ఎన్నో మర్యాదల్ని చేసి మెల్లిగా పరిచయం చేసుకుని,— "స్వామీ! ఈ దగ్గర్లో ఎక్కడో మాట్లాడే రామచిలుక, పాడే చెట్టు, బంగారు నీళ్ళు వున్నా యట. ఆ సంగతి మీకు తెలిస్తే కొంచెంచెప్తారా" అంటూ అడిగింది.

అందుకాసన్యాసి, "అమ్మా! నువ్విప్పుడు మగ వేషం వేసుకున్నా ఆడపిల్లవే — నాదగ్గర దాపరిక మెం దుకు!— బలే కిల్లాడీ పిల్లలాగున్నావు. లేకపోతే యింత ధైర్యంగా యీ విడ్డూరమైన వస్తువులకోసం యింతదూరం రావడమేమిటి?— ఆ మూడు వస్తువులూ సంపాదించడం గొప్ప గొప్ప వీరాధి వీరులకే అసాధ్యం! అలాంటిది నువ్వా ఆడదానివి, అబలవు, లాభంలేదు. తిరిగి యింటికెళ్ళిపో- పెళ్ళిచేసుకుని సుఖంగా ఉండు" అని చెప్పాడు.

కాని రాజకుమారి అంత మీదు మీదుగా అక్కడ నుంచి కదుల్తుందా?- అబ్బో! అలాంటిఘటం కాదుగా!

అందుకని ఆమె సన్యాసికి మరింత దగ్గరగావచ్చి, "అయ్యా! నేను బహు దూరంనుంచి వచ్చాను. నా ప్రయత్నం నెరవేరాలి, మళ్ళీ నేను ఇంటిగడప తొక్కాలి. అంతవరకూ తిరుగుముఖం పట్టడం నా జన్మలోవుండదు. నా ప్రాణాలు పోతాయేమోనని భయపడకండి. ఆ వస్తువులుదొరికే విధం చెప్పండి చాలు " అంటూ బ్రతిమాలుకుంది.

దాంతో సన్యాసిమనసు కరిగింది. భీముడికి, సోముడికి చెప్పినట్టుగానే అన్నీ వివరంగా చెప్పి ఆ వస్తువులను పొందేందుకు దారి ఎటువైపో చూపించాడు. సన్యాసిచెప్పిన కట్టుదిట్టాలన్నీ బాగా గుర్తుంచుకుని ధైర్యంగా గుఱ్ఱమెక్కి బయలుదేరింది కిల్లాడిరాము. సన్యాసి యిచ్చిన గుండు ముందు దొర్లుతూ పోతూవుంటే ఆమె దాన్ని అనుసరించి వెళ్లుతూవుంది.

ఇదివరకటి పర్వతానికి చేరగానే ఆమెకు చిన్నపెద్ద నల్లటి రాళ్ళు కనిపించాయి. అవన్నీ సన్యాసి చెప్పిన రాజకుమారులేననీ, వాటిల్లో నిర్భాగ్యులైన తన అన్నలుకూడా వున్నారనీ, తను యేమాత్రం యేమారినా తనకూ అదేగతి పడ్తుందనీ మనసులో అనుకున్నదామె. అందుకని గుండె ధైర్యం చేసుకుని బయలుదేరింది. వెనకనుంచి వచ్చే భయంకరమైన అరుపులేవీ వినిపించకుండా తన చెవుల్లో పెద్దపెద్ద జీలుగుబెండ్లు పెట్టుకుంది—వాళ్ళ- రప్పలూ యేవీ తగలకుండా తలకొక పెద్ద పాగలాగ చుట్టుకుంది. కొంతదూరం అలా యెక్కి వెళ్లేసరికి వెనకనుంచి ఆమెపైని శరపరంపరగా రాళ్ళవర్షం కురవసాగింది. అయినా ఆమె అదరలేదు. బెదరలేదు. ముందుకు సాగి వెళ్లిపోయింది. కొండ చివర

నొక పెద్ద గుహ వుంది. ఆ గుహ ద్వారంలో పెద్ద బండ రాయి కనిపించింది. మూడు పగళ్లూ మూడు రాత్రులూ దాన్ని పైకి లాగటానికి రాము ఎంతో ప్రయత్నించింది. వెనకనుంచి యెన్నెన్నో భయంకరమైన అరుపులవీ విని పించాయి. కాని చెవుల్లో జీలుగుబెండ్లను పెట్టుకున్నందు వల్ల అవేవీ ఆమెకి వినిపించలేదు. అందువల్ల యేకబిగిని పట్టుబట్టి ఆమె ఆఖరి కెలాగో ఆ బండరాతిని లాగి క్రిందికి త్రోసివేసింది.

గుహ చాలా పెద్దది. అయినా రాజకుమారి ధైర్యంగా ముందుకి నడిచింది. అలా నడుస్తుంటే ఆమె కాళ్ళక్రింద మెత్తగా వున్నట్లనిపించింది. ఏమిటి చెప్మా అని చూసిందామె. అయ్యో, ఇంకేముంది!—అదెవరిదో పెద్ద నాలుక! రాము తల పైకెత్తి చూసింది. ఇదంతా చూస్తే గుహ కాదు. ఎవరో కొండంత రాక్షసుడి నోరు. అటూ యిటూ మెదుపుతున్నాడుకూడాను. ఇక తనపని యింతేనని రాము బెంబేలు పడసాగింది. అంతేకాదు. ఆమె భయపడి నట్టుగానే జరిగింది. ఆఖరికా రాక్షసుడామెను గుటుక్కున మింగివేశాడు.

—కిల్లాడి రాము అది చూచి నిర్ఘాంత పోయింది. బెంబేలుపడిపోయింది. అంతలో ఆ రాక్షసుడి నోరు గబుక్కున మెదిపి గుటుక్కున మింగివేసింది. ఇంకేముంది? రాము భయంతో కళ్లుమూసుకుంది. మళ్లీ కన్ను తెరిచే సరికి ఆమె ఒక పెద్ద మైదానములో వుంది. అక్కడెన్నెన్నో పువ్వులచెట్లున్నాయి, రంగు రంగుల పువ్వులు రమణీయంగా కనిపించాయి. వాటిని చూడగానే రాముకున్న దిగులంతా

పటాపంచలై పోయింది. అలాంటిపువ్వులామె ఇంతకుముం దెన్నడూ చూసియెరగదు. అందుకని ఘబ్బున నవ్వి మరి కాస్త ముందుకెళ్లింది. అక్కడొక పెద్ద పువ్వుల మొక్క గబుక్కున మొలచింది. దాని వింతపుట్టుక చూసి రాము నివ్వెరపోయింది. ఆ మొక్కకు లెక్కలేనన్ని పువ్వు లున్నాయి. ఒక్కొక్క దానికి ఒక్కొక్క రంగు - అయినా వాటి పోలికంతా ఒకటే! వాటి ముద్దరంగులు చూస్తూంటే ముద్దులు గొల్పుతూ వుంది. ఆకుల పైనీ - పువ్వుల పైనీ యేదోచెమ్మెలాగ మెరుస్తూ వుంది. దాన్నిచూసి రాము యెంతో ముచ్చటపడి దాని పువ్వులు కొన్ని కోసుకుని తలలో పెట్టుకుందామని ఆ మొక్క దగ్గర కెళ్లింది. కానయితే దాని పువ్వులు రెండు మూడు కోసిందో-లేదో గాని, గభాల్న ఆ మొక్కవుండేచోట నేలంతా పెద్ద బీట వేసింది. అబ్బా! అది యెంతలోతు-యెంత వెడల్పు బీటనుకున్నారు. అదింకా అంతకంతకు పెద్ద దవడం మొద లెట్టింది. ఆఖరికి పాతాళం వరకూ అది వ్యాపించింది. అంతే కాదు ఆ గోతిలోనుంచి దడదడమనే చప్పుడూకూడా విన బడింది. అది విని రాము భయపడింది. కాళ్లు వణకసాగాయి. కళ్లు వెళ్లబెట్టి ఆ వింత గోతిలోకి తొంగిచూస్తూ ఎటూ కదల్లేక నిలబడి కాస్సేపటికి కళ్ళు చెదిరి మైకం కమ్మి రాము పాపం ఆ గోతిలో పడిపోయింది. రాముకేం తోచలేదు. బెంబేలెత్తి కళ్ళు మూసుకుంది. ఆ గొయ్యి కొన్ని యోజ నాల పొడవుంది. రాము కళ్ళుతెరచి చూసింది. తనొక అగాధమైన మహాసముద్రంలో పడి వుంది. తననింకా ప్రాణాలతో వుంచినందుకు భగవంతుడికి పదివేల నమస్కా

రాలు చేసింది. అంత ప్రమాద సమయములో ఆమెకి అంత వరకూవున్న దిగులంతా పటాపంచలై పోయింది. ఎంత కష్టాన్నయినా ధైర్యంగా యెదుర్కోవాలని ధృఢనిశ్చయం చేసుకుంది. ఆమె అన్నివిద్యల్లోనూ కిల్లాడీయేగా మరి! ఈతలోకూడా దిట్ట-అందుకని అమె ధైర్యంగా ఈతాడుతూ సముద్రం మధ్య కెళ్లిపోయింది. ఎన్నెన్నో పెద్ద పెద్ద చేప లామెని మింగేయాలని చూశాయి. కాని లాభం లేక పోయింది. అవన్నీ ఆమె కత్తికి బలియైపోయాయి.

అంతూ పొంతూలేని ఆ సముద్రంలో రాము కిక దారీ-తెన్నూ యేమీ కనిపించడం లేదు. అయినా ఆ నీటి మొక్కలమధ్య - చేపలమధ్య ఈదుకుంటూ ఎక్కడికో వెళ్లి పోతూనేవుంది. అంతలో ఎక్కణ్నుంచి వచ్చిందో మరి, పెద్దచేప ఒకటి రంయిమనివచ్చి ఆమెని మిగతా చేపల మోస్తరుగా మింగివేయడం మాని, ఆమె మెడని ముద్దుగా నిమరడం మొదలుపెట్టింది. అది మామూలు చేపల వంటిది కాదు. తళతళ మెరిసే పంచరంగుల చేప! రాముకి కితకితలు పెట్టినట్టయింది. ఆ చేప యెంతో ఆప్యాయంగా తనచుట్టూ తిరగడం-తనని ముద్దులాడడం చూసి రాముకెంతో విడ్డూర మనిపించింది. చేతిలోనున్న కత్తిని నడుముకి గుచ్చుకుని ఆమె యీదుకుంటూ ఆ వింత చేపను నింపాదిగా పట్టుకుంది. దాంతో ఆ చేప గాబరా యింకేమని చెప్పాలి. గిల గిలమని గింజుకుంటూ అది మనుషుల భాషలో అన్నది గదా,- "అమ్మాయీ! అందాల అమ్మాయీ! నీకు పుణ్యముంటుంది నా పీక పిసికేయకు, నేను చేపనుకాను. నీలాంటి మనిషినే! ఈ సముద్రంలో వుండే జలరాక్షసు డొకడిలా మార్చి

వేశాడు. ఆ కథంతా తర్వాత చెప్తాగానీ నువ్వొక వుపకారం మట్టుకి చేసిపెట్టాలి. మరి కొంచెం సేపట్లో ఆ రాక్షసుడు వస్తాడు. అతనిచుట్టూ ఎందరెందరో జలకన్య లుంటారు. వారిలో నువ్వుకూడా ఒకతెవై పోవాలి. ఆ రాక్షసుడి అభిమానం సంపాదించుకోవాలి. వాడి దగ్గర అద్భుతమైన మంత్రదండ మొకటి వుంది. అది కాస్తా మంచి మాటల్తో సంగ్రహించ గలిగావంటే వాణ్ణి నామరూపాలు లేకుండా హతమార్చే పూచీ నాది.''

ఇది వినేసరికి కిల్లాడి రాము భయపడిపోయిందనుకున్నారేమో! అబ్బే-సరే నని ఆ చేప రాజకుమారుడికి ధీమాగా మాట యిచ్చింది. అంతలో గాండ్రు గాండ్రు మనుకుంటూ జలరాక్షసుడు విరుచుకు పడ్డాడు. రాము వాడి కళ్ళనుంచి తప్పించుకుని నింపాదిగా అతని వెంటవస్తున్న జలకన్యల్లో కలసిపోయింది. కలిసిపోవడమేమిటి? తన తళుకు బెళుకుల్తో ఆ రాక్షసుణ్ణి తన్మయుణ్ణి చేసుకోగలిగింది. మాటల చమత్కారంతో వాణ్ణి తనవశం చేసుకుంది. ఒకనాడు అర్ధరాత్రి వేళ ఆ రాక్షసుడు బాగా త్రాగి కైపెక్కి ఆ మత్తులో గుర్రుపెట్టి నిద్రపోతున్న అదను చూచుకుని వాడి బొడ్లోనున్న మంత్రదండాన్ని నింపాదిగా లాక్కుని పారిపోయింది. ఆ దండాన్ని తిన్నగా చేప రాకుమారుడి దగ్గరకు తీసుకెళ్ళి అతనికి దాన్ని తగిలించింది. ఆఫళంగా ఆచేప ఒక మంచి అందాల రాకుమారుడిగా మారిపోయింది. అది చూడగానే రాము నిర్ఘాంతపోయింది. అలాంటి నవయవ్వన సుందరాకారుణ్ణి చూసి ఆమె కళ్లు మిరుమిట్లు గొల్పాయి. ఆమె ఆనందాని కంతులేకపోయింది.

కాని ఆ యానందం ఎంతో సేపు లేదు. జల రాక్షసుడు జరజరా పరుగెత్తుకుంటూ వచ్చి గభాల్న రామునీ, రాజకుమారుణ్ణి మింగివేసాడు. పాపం యెన్నో ఆశలు పెట్టుకున్న చేప రాకుమారుడూ, రామూ రాక్షసుడి పొట్టలో పడి గిలగిలకొట్టుకోసాగారు. ఎప్పటికే యాపద వచ్చిపడ్తుందో ఎవరికి తెలుస్తుంది మరి!—

అయితే అలాంటి ఆపద సమయంలో రాజకుమారుడి కొక చిన్న వుపాయంతోచింది. తన కత్తితీసి ధైర్యంగా లోపలే నిలబడి ఆ రాక్షసుడి పొట్టను చీల్చి చెండాడాడు. ఆ కత్తిపోట్లకు తాళలేక తాటిచెట్టంతటి రాక్షసుడు టపీమని చచ్చి కూలిపోయాడు. వాడితో బాటు వాడి మంత్రదండం కూడా రెండు ముక్కలుగా విరిగిపోయింది, 'అమ్మయ్యా!' అనుకుని రాజకుమారుడూ, రామూ వాడి కడుపులోనుంచి బయటికొచ్చారు. రాము చేసిన సాహసాన్ని చూచి ఆ రాజకుమారుడెంతో విస్తుపోయాడు. 'శభాష్' అంటూ మెచ్చుకున్నాడు. ఆమె భుజంపైని చెయ్యివేసి, "అమ్మాయీ! నువ్వెవరివో తెలియదుగాని నాకు చేసిన యీ వుపకారం మాత్రం యెన్నటికీ మరువలేను. ఆడపిల్లవైనా అమోఘమైన పరాక్రమాన్ని ప్రదర్శించావు. నేను పాతాళ లోకపు యువరాజును. ఒకనాడు వేటకని వచ్చి యీ మాయ రాక్షసుడికి బందీఅయిపోయాను. సమయానికి వచ్చి సాయంచేశావు నీ ఋణం యెన్నటికీ తీర్చుకోలేను. ఈ సముద్రం అడుగున వుంది మారాజ్యం. నువ్వూ నాతో వచ్చావంటే మా అమ్మా నాన్నలకు నిన్ను చూపిస్తాను నిన్ను చూసి వాళ్ళెంతో



మురిసిపోతారు. నువ్వెలాగైనా నాతో రావాలి" అంటూ బ్రతిమాలుకున్నాడు.

ఇంకేం జేస్తుంది కిల్లాడి రాము!. ఎలాగైనా ఆ మహా సముద్రంలో నుంచి బయటపడి ఒడ్డు జేరుకోవాలనే ఆమె ఆరాటం. అందుకని సరే వస్తానని చెప్పింది. ఇది విన్న ఆ రాజకుమారుడి ఆనందం ఇంతా అంతా కాదు. వెంటనే రెండు చిటికెలు వేశాడు. ఆ చిటికెలు పూర్తికాకుండానే ఒక అపూర్వమైన పెద్ద రథం అక్కడ తయారాయింది. పాతాళ రాజ్యపు యువరాజు రాముని ఆ రథంమీద కూచోబెట్టాడు, తను రథం తోలడం మొదలెట్టాడు. మరి అదేం విడ్డూరమైన రథమోగాని ఆ మహాసముద్రంలో గాలి కన్న జోరుగా పరుగెత్తడం మొదలెట్టింది. ఆ విసురుకి రాము ఆగలేక భయపడి కళ్లు మూసుకుంది. మళ్లీ కళ్ళు తెరిచి చూసేసరికి ఇంకేముంది? అక్కడ సముద్రమూ లేదు, నీళ్లూ లేవు మంచి మైదానాల మధ్యని రథం జోరుగా వెళ్లిపోతూవుంది. రాము రాజకుమారుడి వైపు అప్పుడు తేరిపార చూడగలిగింది. గొప్ప గొప్ప విలువైన జలతారు దుస్తులు-తల మీద వజ్రాలతో ధగధగ మెరుస్తున్న కిరీటం- ఎంత అందంగా వున్నాడనుకున్నారు!. అతనుకూడ చిరునవ్వు నవ్వుతూ వెనక్కి తిరిగి ఆమెవైపు ఒకసారి చూశాడు. అతనికామె అపర రంభ లాగ కనిపించింది.—"అందాల రమణీ! ఏ రాజ్యంనుంచి వచ్చిన రాజకుమారివి నువ్వు?" అంటూ అడిగాడు తన ఆరాటం ఆపుకోలేక;-

"నేను రాజకుమారిని కాను. ఒక రాజుగారి దగ్గర పనిచేసే తోటమాలి కూతుర్ని" అని చెప్పింది రాము.

అయినా రాజకుమారుడీమాట ఒకంతట నమ్మలేదు. అప్పుడు కిల్లాడిరాము తన సాహసగాథ నంతటిని తొలినుంచి చివరిదాకా వల్లించి చెప్పింది.

అదివిని రాజకుమారుడు చాలా విచారించాడు.

అయ్యో పాపం!- ఆ మూడు వస్తువులకోసం మీ అన్నలిద్దరూ రాళ్ళుగా మారిపోయారన్నమాట. అయినా ఫర్వాలేదు. "కష్టేఫలే." అని వూరికే చెప్పలేదుగా మన పెద్దలు. నువ్వు పడ్డ అవస్థలకు తగిన ఫలితం త్వరలోనే లభిస్తుంది లే! అందుకు నీతో బాసటగా నేనూ వుంటాను. సరేనా!'' అంటూ హామీ యిచ్చాడు రాజకుమారుడు.

ఈ మాటలకు రాము యెంతో సంతోషించింది. "అయితే! యింతకూ మీ సంగతి చెప్పారు కాదు" అంటూ చిన్న చలోక్తి విసిరింది అతని వైపు క్రీగంట చూస్తూ.

"నేనా!-చెప్పానుగా పాతాళ రాజ్యానికి యువరాజునని;-నాపేరు శేషు. నామహాలంతా మణులమయం. చుట్టూ బంగారుగోడలు. దాంట్లో సూర్యరశ్మి వుండదు గనక వజ్రాల దీపాలెప్పుడూ వెలుగుతూ వుంటాయి. నవరత్నాల ఖజానా నా దగ్గరే వుంది. నీకేంకావాలన్నా తెచ్చియిస్తాను" అన్నాడు రాజకుమారుడు.

రథం చాలా జోరుగా వెళ్తూ క్రొత్తదోవ పట్టింది. అంతకంతకు చీకటి పడసాగింది. త్రోవకు రెండు ప్రక్కలా మట్టి మెట్టలూ, గుట్టలూ యెన్నో వున్నాయి. వాటి మధ్యను డడడడమని రథం నడస్తూ వుంటే, ఆ ధ్వని మారు

మ్రోగుతూ ఎడతెరిపి లేకుండా వురుములు వస్తున్నాయా అన్నట్టుంది. అలా ఆ రాత్రంతా రథం నడుస్తూనే వుంది.

తెలతెల వారింది. దూరాన ఒక పెద్ద సింహద్వారం కనిపించింది. శేషు దాన్ని ఆమెకి చూపిస్తూ "అందాల రామూ! మన రాజ్యానికి వచ్చేశాం అల్లదుగో! ఆ సింహద్వారం కనిపిస్తుందే!—అదే మన కోటగుమ్మం!!" అన్నాడు.

మరి కొంతసేపటికి రథం ఆ కోట గుమ్మం దగ్గరకెళ్ళి ఆగిపోయింది. సింహద్వారానికి ప్రక్కనే పెద్ద విడ్డూరమైన కుక్క వుంది. దానికి మూడుతలలు! దుక్కగా, మోటుగా భయంకరంగా, క్రూరంగావుంది. ప్రతి శిరస్సూ తక్కిన్నా రెండు తలల కన్న యెంతో భీకరంగావుంది. రాజకుమారుడు శేషు దాని మూడుతలలపై ఒకసారి ప్రేమతో నిమిరాడు. అతణ్ణి చూసి అది కులాసాగా తోక ఆడించింది కాని దాన్ని చూడగానే రాముకి భయం పుట్టింది. శేషు అప్పుడామెకి ధైర్యం చెప్తూ! "మరేం ఫర్వాలేదు. రామూ, ఈ కుక్క ఎవ్వరికీ ఏహానీ చెయ్యదు. మా అనుమతి లేకుండా యీరాజ్యంలో అడుగు పెట్టేవారినీ, మా యిష్టం లేకుండా యిక్కణ్నుంచి పారిపోయే వారినీ మాత్రం యిది అడ్డుతుంది కాని ఇంకొకరి జోలికిపోదు" అన్నాడు.

రథం మళ్ళీ బయలుదేరి తిన్నగా రాజమహాలు లోపలికెళ్ళి పోయింది.

అంతఃపురంలో యువరాజు శేషు ఆమెని వెంటబెట్టు కొని తిన్నగా తన తల్లిదండ్రులవద్దకు తీసుకెళ్ళాడు ఆమె

చరిత్ర యావత్తూ వారికి వివరించి, తన ఆపద నుంచి రక్షించిన వైనమంతా చెప్పాడు. అది విని అతని తల్లిదండ్రులు లామెనెంతో మెచ్చుకుని ఆప్యాయంగా కౌగిలించుకున్నారు.

అప్పట్నుంచీ రాము అక్కడే, ఆ రాజమహల్లో విచారంగా వుంటూవుంది. ఆమెకి ఆనందం కలిగించాలని యువరాజు శేషు ఒకనాడామెను సముద్ర తీరానికి తీసుకెళ్ళాడు. సముద్రం చూడగానే రాము ఉప్పొంగిపోయింది. అంతలో ఒక అందమైన సీతాకోకచిలుక ఎక్కణ్ణుంచి వచ్చిందో వచ్చింది. అది కావాలన్నది రాము. యువరాజు శేషు దాన్ని పట్టుకోవాలని వెళ్ళాడు. రాము వెనక్కి తిరిగి చూసింది. ఇంకేముంది?—పెద్ద ఆబోతు ఒకటి తన మీదని విరుచుకుని పడింది

ఆ మెద్దు పాలమీగడలాగ తెల్లగా వుంది. ఇంతకూ అకస్మాత్తుగా అదెక్కణ్ణుంచి వచ్చిందో! తనూ యువరాజు శేషూ అంతవరకూ ఆ చుట్టుపట్ల సముద్రతీరాన్నే తిరుగుతూ షికారు చేస్తున్నారే! ఎక్కడో ఒక్క పశువు కూడా అంతకు ముందు కనిపించలేదే! అయినా ఇవన్నీ ఆలోచించేందుకు టయిమెక్కడిది? - చేతిలోవున్న గులాబీ పువ్వుల్నీ కస్తూరి పువ్వుల్నీ అక్కడ విసిరి పారవేసి గబుక్కున రెండు మూడడుగులు వెనక్కి వేసింది. "శేషూ-రాజకుమార్ శేషూ-ఎక్కడున్నావు. వేగంగారా! ఈ మెద్దుని తరిమేయి" అంటూ భయంతో బిగ్గరగా కేకలు వేసింది.

యువరాజు శేషు అక్కడెక్కడ వున్నాడు! అసలామె పిలుపు అతనికి వినిపిస్తే గదా! అంతేగాకుండా రాము బెదరి

పోతూ గొంతెత్తి గట్టిగా పిలవలేక పోయింది. అందుకని ఆమె వెలవెలబోతూ అక్కడే నిలబడి వుండి పోయింది.

అయితే యింకో గమ్మత్తు-అంత పెద్దపెద్ద కొమ్ముల యెద్దును చూడడం అదే తొలిసారి కావడం మూలాన రాము అంతగా అదరి బెదరి పోయింది కాని ఆ యెద్దు నిజానికంత భయంకరంగా లేదు. ఎంతో ముద్దుగా-ఎంతో సొగసుగా వుంది. ముఖంలో ఆప్యాయత కూడా వుట్టి పడుతూవుంది. నోట్లోనుంచి మంచినుంచి వాసనలు వస్తున్నాయి. ఆ తళుకు బెళుకు కన్నులూ-దంతాల్లాంటి కొమ్ములూ దాని అందమూ, అదీచూస్తే ఎంచక్కావుందనుకున్నారు! అటూ యిటూ పరుగెత్తుకుంటూ అది కులాసాగా కుప్పిగంతులు వేయసాగింది. ఆ యెద్దుచేసే చిలిపిచేష్టలన్నీ చూస్తూవుంటే కిల్లాడిరాము భయం యెక్కడిదక్కడే పటాపంచలై పోయింది. గొర్రెపిల్ల కన్న ఏమీ చేయని దానిలాగ కనిపించింది.

రాము యెంతో ఆప్యాయంగా ముందుకెళ్లి ఆ యెద్దు ముఖంపైని తన లేతచేతితో నిమిరింది. తన మెడలోవున్న పువ్వుల దండల్ని దానిమెడలో వేసింది. ఆ పిల్ల అలా ముద్దు ముద్దుగా దగ్గరకు రావడం తనతో నేస్తం కలపడంచూసి ఆ యెద్దుకి హద్దుమీరిన ఆనందం కలిగింది. ఆ హుషారులో అది అక్కణ్ణుంచి యిక్కడకు - యిక్కణ్ణుంచి అక్కడకు పరుగులు తీయడం ప్రారంభించింది. అది అలా గెంతుతూ పరుగెత్తుతూ వుంటే పక్షి లాగ చెట్టుపైనుంచి యింకొక చెట్టుపైకి యెగురుతున్నట్టుంది. అది గాలిలో యెగురుతున్నదా అన్నట్లు కనిపిస్తున్నది; దాంట్లో మరి యే ఆకర్షణశక్తి వుందోగాని, రాము దాని చిలిపి చేష్టలకు యిట్టేలొంగి,

దానికి మంచి నేస్తమైపోయింది. రాము దగ్గర అంత పెద్ద యెద్దు చిన్న కుక్క పిల్లలాగ వంగి వంగి యెంతో అణకువగా వుంటున్నది. కొంతసేపటికది రాముని తన వీపుపై కెక్కి సరదాగా సవారి చేయమని సైగలు చేసింది. ఆ సైగలు వెంటనే అర్థంచేసుకుంది రాము. ముందు దానిపై కెక్కి కూర్చోడానికి వెనకాడింది. కాని తర్వాత ఆలోచించింది. అంత మచ్చికగా వుంటున్న ఆ యెద్దు నేస్తం పై నెక్కి అలా షికారుకొట్టి రావడం యేమంత తప్పవని కాదనుకుంది. ఎలాగు రాజకుమారుడు శేషు అక్కడ లేడాయెను!- సీతాకోక చిలుకనుపట్టి తెచ్చేందుకెళ్ళి యింకా తిరిగి రాలేదు. ఈలోగా చక్కా షికారుకొట్టి రావచ్చుననుకుంది. ఇలా ఆలోచించుకుని నింపాదిగా ఒక అడుగు ముందుకువేసి చిన్న ఉడతలాగ ఒక్క యెగురు యెగిరి ఆయెద్దుపైకెక్కి క్రింద పడిపోకుండా రెండుచేతులతోనూ దాని నున్నటి కొమ్ములన్ని గట్టిగా పటుకుని కూర్చున్నది.

రాము యిలాయెక్కి కూర్చోగానే ఆయెద్దు గభాల్న ఒక్క గంతువేసి గబగబా దవుడు తీసింది అది తిన్నగా యువరాజు శేషు సీతాకోక చిలుకను పట్టుకొన్న వైపుకి పరుగెత్తింది. అతనప్పటికే రాము తెమ్మన్న సీతాకోక చిలుకని పట్టుకున్నాడు. అతన్ని చూడగానే రాము ఆనందంతో కెవ్వున కేక వేసింది. శేషు తలయెత్తి చూశాడు. అయ్యయ్యో! రాము ఒక తెల్లని యెద్దుపైని కూర్చొనివుంది. అదిచూసి నవ్వాలో, యేడవాలోకూడా అర్థంకాలేదు. "అయ్యో! రామూ! దిగుదిగు-అదిమంచిదికాదు" అంటూ కేకలు వెయ్యడం మొదలెట్టాడు యువరాజు శేషు.

"మరేం ఫర్వాలేదు. ఇది మా నేస్తమే- దీంతో అలా షికారుకెళ్ళి వస్తాను" అంటూ బింకంగా మరి చెప్పింది రాము.

తర్వాత ఉన్నట్టుండి ఆ యెద్దు యేంచేసిందను కున్నారు! గబుక్కున తన జోరు యెక్కువ చేసింది. గబ గబా గంతులు వేసుకుంటూ పోయి ఒక్క యెగురు యెగిరి నురగలుకక్కే ఆ మహాసముద్రంలోకిదిగి పోయింది. రాము పాపం బెంబేలుపడి "అమ్మయ్యో! అని కెవ్వున కేకవేసింది. అల్లంత దూరాన్నుంచి ఈ దృశ్యం చూస్తున్న యువరాజు శేషు నిశ్చేష్టుడై నిలబడిపోయాడు. అంతకన్నా యేం చేయ గలడు? చూస్తూ చూస్తుండగానే ఆ మోసకారి యెద్దు పాపం రాముని అమాంతంగా సముద్రంలోకి తీసుకుపోయింది. అయినా చేయజాలిపోయేక అతను మాత్రం యేం చేయ గలడు? అతని కళ్ళవెంట వేడి వేడి కన్నీళ్లు జలజలా కారాయి.

ఆ యెద్దు సముద్ర మధ్యని ఈదులాడ్తు వుంది. నీటి పైని దాని ముఖం, పొడుగాటితోక మాత్రం కనిపి స్తున్నాయి. పాపం రాము ఒక చేతిని యువరాజు శేషువైపు చాపి, రెండవచేత్తో యెద్దు కొమ్ముల్ని గట్టిగా పట్టుకుని కూర్చున్నది. కొంత సేపటికి ఉవ్వెత్తున పొంగి పొరలే కెర టాలలో ఆ యెద్దు మునిగిపోయింది. మరి ఆ పాపిష్టియెద్దు యేమయి పోయిందో !— ఆ యందాల కన్య కిల్లాడిరాము యేమయిందో !—

ఇంటి దగ్గర కెళ్తే! తన తల్లి దండ్రులు యేదిరా అమ్మాయి రాము? అని అడిగితే ఏం జవాబు చెప్పడం ? —

తన తండ్రి చాలా ఆదర్శాలు కలిగినవాడు. ఆఖరికి తన రాజ్యమంతా పోయినా సంతోషిస్తాడు గాని తన ఇంటి కొచ్చిన అతిథులకి చిన్న మెత్తు హాని కలిగితే ఓర్చుకోలేడు. అంతటి దయామయుడు. అందుకనే శేషు జరిగిన వృత్తాంత మంతా చెప్పేసరికి ఆయనకు కలిగిన దుఃఖం ఇంతా అంతా కాదు. అప్పటికి చీకట్లు కమ్ముకుంటున్నా సరే, అమ్మాయి రాము ఎక్కడుందో వెతకాలంటూ ఆజ్ఞాపించాడు.

"పాపం - చిదిమితే పాలుగారే సుకుమారమైన శరీరం గలిగిన అమ్మాయి మనల్ని నమ్ముకుని ఇక్కడి కొచ్చింది. ఏవేవో సాధించాలని ఎన్నెన్నో కలలు కన్నది. అలాంటి చిన్నది ఎక్కడో ఏ ఆపదలోనో చిక్కుకుంటే మనం చూస్తూ వూరుకోకూడదు. ఇదుగో! శేషూ! ఆమెని నా దగ్గరకు తీసుకుని రాకుంటే మాత్రం నాకు మళ్ళీ నీ ముఖం చూపించకు" అంటూ కళ్ళవెంట నిప్పులు కురి పిస్తూ ఆజ్ఞాపించాడు పాతాళ రాజు.

పాతాళరాజు మహా కోపిష్టి. ఆయనకి కోపం వచ్చిం దంటే యిన్నూ, మిన్నూ కనిపించదు. యువరాజు శేషు ఆ బెదురుతో తిండిఅయినా తినకుండా కోటనుంచి నింపా దిగా జారుకున్నాడు. అయినా యెక్కడికని వెళ్ళి వెతకడం? అందుకే కోటగుమ్మందగ్గర కూర్చుని విచారంగా ఆలో చించ సాగాడు. అంతలో అతని తల్లి మనసు వుండబట్టలేక అక్కడికి పరుగెత్తుకుంటూ వచ్చింది. ఆమెకు వున్నవాడు కూడా అతడొక్కడే! — అందుకని అతణ్ణి ముద్దుపెట్టుకుని, "అయ్యో నాయనా! నన్ను వదలిపెట్టి వెళ్ళిపోవాలను కున్నావా?—ఆ రాము పోయినట్టు నువ్వుకూడా మాయమై

పోషే నా గతియింకేం కాను, అందుకనే నేనూ నీతో బయలు దేరాలని వచ్చాను. నువ్వెక్కడుంటే నేనూ అక్కడే" అని చెప్పింది తల్లి మమత చంపుకోలేక—

యువరాజు శేషు యెంత వాదించినా వినలేదా తల్లి. ఆఖరికి అతని భుజాల నానుకొని అతనివెంట బయలుదేరింది. ముసలితల్లిని వెంటబెట్టుకుని అక్కడనుంచి వెళ్ళిపోయాడు శేషు. అలా వెళ్తూ వెళ్తూ ఒక సంవత్సరం గడిచింది, రెండేళ్ళు - మూడేళ్ళు - పదేళ్ళు గడిచిపోయాయి. పాతాళ రాజు ఒంటరిగా తనకోటలో కూర్చుని తన కొడుకూ - రాముా యెప్పుడు వస్తారా అని వెయ్యికళ్ళతో యెదురు చూడసాగాడు

తన ప్రియమైన రాణి అనురాగపు మాటలు - తన కొడుకు ముద్దుమాటలు యెప్పటికి వినిపిస్తాయూ అని పాపం యెదురుచూస్తున్నాడు. కాని అంతకూ రాలేదు, ఇంతకూ రాలేదు. ఎన్నో యేళ్ళు గడిచిపోయాయి.

అక్కడ యువరాజు శేషూ - అతని తల్లి ఎన్నెన్నో దేశాలను దాటుకుంటూ - యెన్నో కొండలెక్కి —ఎన్నో నదులు దాటి వెళ్ళిపోయారు. వెళ్ళినదగ్గరల్లా అందాలకన్య రాము భోగట్టా అడుగుతూ - ఆమెజాడ యెవరయినా చెప్తారేమోనని కనుక్కుంటున్నారు. వాయువేగాన పరుగెత్తే తెల్లటి యెద్దుపైనెక్కి రాజకుమారిలాగవుండే చిన్నది ఎవరికయినా కనిపించిందా అంటూ అడిగేవారు. కాని ఎవ్వరూ చెప్పలేకపోయారు. ఎక్కడకెళ్ళి అడిగినా ఇదే మాట. ఆఖరికి యువరాజు శేషూ, అతని తల్లీ ఊళ్ళనక -

నగరాలనక-కొండలనక-అడవులనక కాళ్ళరిగేటట్టుఎన్నాళ్ళు ఏకబిగిని వెతుకుతూ వెళ్లారో చెప్పడం కష్టం. తాము కట్టు కున్న బట్టలు సహా చినిగి పేలికలై పోయాయి. వంటినిండా ధూళి;— కొన్నాళ్ళకు శేషు ముసలితల్లి తన కిరీటాన్ని - ఆభరణాల్ని అన్నీ తీసివేసింది. ఇద్దరూ రాజదుస్తులు వదిలి పెట్టి, మామూలుదుస్తులు వేసుకున్నారు. ఆ దుస్తుల్లో వారు పిచ్చెక్కిన బిచ్చగాళ్ళలాగ కనిపిస్తున్నారు. చూసిన వాళ్లందరూ వారెవరో యెరుకల వాళ్ళనుకుంటున్నారు. మూశారా! పాపం యువరాజు శేషుకూ! అతనివల్ల తల్లికి ఎన్నికష్టాలొచ్చి పడ్డాయో! అయినా ఎంతతిరిగినా రాము జాడ కనిపించలేదు. వారికికూడా విసుగుపుట్టింది. అప్పుడు శేషు తల్లిని దగ్గరకుతీసుకొని,— "అమ్మా! ఎన్నాళ్ళని ఇలా తిరగడం?— మనం నిజంగా కలగంటున్నట్టున్నాం. ఆ రామునీ, తెల్లయెద్దు యెత్తుకుపోయి ఎన్నో సంవత్సరా లయింది. ఆ యెద్దు ఈపాటికి ఏంచేసిందో, ఏమో!— ఎవ రన్నడిగినా మాకు తెలియద్దంటే మాకు తెలియదంటున్నారు ఆమె ఇప్పుడు బ్రతికివుందో, లేదో కూడా అనుమానమే;— అలాంటి ఆమెను వెతుకుతూ మన ప్రాణాల్ని కష్టాలపాలు చేసుకోవడం నా కిష్టంలేదు. నాన్నగారు ఆమెను తీసుకు రాకుండా కోటగుమ్మం తొక్కవద్దన్నారు. అంతేగదా! ఇక్కడే చిన్న గుడిసె కట్టుకుని హాయిగా వుండిపోదాం" అన్నాడు.

అందు కతని తల్లికి ఇష్టం లేదు. అయినా కొంత కాలం వరకూ అక్కడే వుండి కొడుకుతో సేద దీర్చుకుని మళ్ళీ బయలుదేర వచ్చుగదా అని ఒప్పుకుంది. వెంటనే

శేషు ఆ యడవిలో రమ్యమైనచోట చక్కటి పర్ణశాలను నిర్మించాడు. అదిచూసి ఆ చుట్టుపట్ల కూలినాలి చేసుకునే మనుషులందరూ చిన్నచిన్న ఇళ్ళు కట్టుకున్నారు. అలా అదీ కొన్నాళ్ళ కొక పెద్ద వూరుగా మారిపోయింది. ఆ ఇళ్ల నడుమ పెద్ద చలువరాతి మేడ కట్టుకుని తల్లితో వుంటు న్నాడు యువరాజు శేషు. వారి రాజఠీవి అంతా చూసి అక్కడి ప్రజలంతా అతణ్ణి తమ వూరికి రాజుగా చేసుకున్నారు. రాజుగా మారినా శేషుమాత్రం కనిపించని రాము సంగతి మరచిపోలేదు. తన వూళ్ళో దండోరా వేయించాడు. పల్లటి మెద్దుపైనున్న అమ్మాయి ఎవరైనా కనిపిస్తే తనవద్దకు తీసుకురావాలని చాటింపు. వారికి వెయ్యి మోహిరీలు బహుమానం ఇస్తాననీ చాటింపించాడు. అంతే కాదు. కొందరు భటుల్ని తోడిచ్చి ఒక దూతను రాము సంగతి కనుక్కోమని దేశ దేశాలకూ పంపించాడు. కాని ప్రయోజనం లేకపోయింది. పగలు రాజరికం చేస్తూ రాత్రి వేళల్లో మామూలు దుస్తులు ధరించి కొన్ని కోసుల దూరం వరకూ వెళ్లి వెతికి వచ్చేవాడు. ఆఖరికి రాము కనిపించక పోయినా, ఆమె యెక్కిన యెద్దు కాలి మచ్చలయినా కనిపించకుండా పోతాయా అని అతని ఆశ! కాని ఆ యాశ అడియాసగానే వుండిపోయింది.

ఒకనాడు శేషు ముసలి తల్లి అతణ్ణి పిలిచి, "నాయనా! అమ్మాయి రాముకోసం దూరం వచ్చాం. కాని ఇక్కడ రాజభోగాలనుభవించేందుకు కాదు. అందుకని మనం మళ్లీ ఆమెని వెతుక్కుంటూ బయలుదేరుదాం పద" అంటూ మళ్ళీ ప్రయాణానికి పురమాయించింది.

సరేనని ఇద్దరూ అక్కణ్నుంచి బయలుదేరారు. ఆ ముసలావిడ అలా చెమట్లు కారుస్తూ నడుస్తూవుంటే చూసేవారంతా కంట తడిబెట్ట సాగారు. అయినా అంత ముసలి అమ్మ యెంతకాలమని అలా నడవగలదు. ఒకచోట ఆమెకి శోషవచ్చి పడిపోయింది. అది ఆయాసం క్రింద మారి పోయింది. శేషు ఆమె అవస్థ చూసి గాబరాపడి కళ్ళవెంట నీరు కార్చసాగాడు.

అప్పుడా ముసలి తల్లి అతణ్ణి ఓదారుస్తూ, "నాయనా! మరేం దిగులు పడకు. ఇక నాకు చావు సమీపించింది. మీ నాన్న గారిప్పు డిక్కడుంటే ఎంతో బాగుండేది. కాని అంత అదృష్టానికి నేను నోచుకోలేదు తండ్రీ! అయినా ఇక్కడే గోతిని త్రవ్వి అందులో నన్ను పడుకోబెట్టు - ఇది దీర్ఘ నిద్ర - మన ఋణానుబంధం ఇంతే! భగవంతుడే నిన్ను కాపాడ్తాడు" అంటూ ప్రాణాలు విడిచింది.

పాపం యువరాజు శేషు చంటి పిల్లవాడిలాగ అమ్మ శవంపైబడి కేకు కేరున యేడ్చాడు. అక్కడే ఆమెనుపాతిపెట్టి ఆమెకి పుత్రక్రియలన్నీ జరిపించాడు — ఇప్పుడు శేషు ఏకాకి అయిపోయాడు.

అయినా కొన్నాళ్ళకు ధైర్యం చిక్కబట్టుకుని ఒంటిగా అక్కణ్ణుంచి బయలుదేరాడు త్రోవలో కనిపించిన వారినందర్నీ రాము సంగతి అడుగుతూనే వున్నాడు. అందుకు ప్రతివారూ ఏదో సమాధానం చెప్పిపోతున్నారు. ఒకచోట మాత్రం పడవ పైకెక్కి కూర్చుని యేదో ఏటిని దాటుతూ వుండగా ఆ పడవ కలాసీ అన్నాడు గదా, —

"అయ్యా! చాలా సంవత్సరాల క్రిందట ఏదో దేశంలో ఒక తెల్లటి యెద్దు సముద్రంలో యీదుకుంటూ యెవరో అమ్మాయి నెత్తుకుని వచ్చిందనీ, ఆమె మెళ్ళో వున్న పువ్వులు సముద్రపు టుప్పుగాలికి వాడిపోయాయని మావాళ్ళనుకుంటూ వుండడం మాత్రం విన్నాను. అంతే గాని నేను చూడలేదు బాబయ్యా! మరి అది నిజమో అబద్ధమో తెలియదండి" అని చెప్పాడు.

అది వినగానే యువరాజు శేషుకి ప్రాణం లేచి వచ్చినట్టయింది.

అయినా అతని ఆనందం మరు నిముషములోనే మటుమాయమైంది. ఎక్కడో విన్నమాటలు యెంతకని నమ్మడం? ఏదో కలగన్నట్టేవుంది అతనికి;- రాముని తలంచుకుని రెండు కన్నీటిబొట్లు కార్చాడు. అంతకన్న ఆ సమయంలో అతను మాత్రం ఏం చెయ్యగలడు పాపం!.

కానైతే తన అమ్మ చనిపోతూ - చనిపోతూ ఒక చిన్న భోగట్టామాత్రం చెప్పింది. ప్రపంచమధ్యలో పెద్ద మత్స్యగుండం ఒకటి వున్నదనీ, దాంట్లోవుండే రంగు రంగుల చేపలన్నిటికీ మత్స్యరాణి గొప్పదనీ, ఆమె తన తండ్రి పాతాళరాజు చెల్లెలనీ, ఆమె దగ్గరకెళ్ళి రాము ఎక్కడున్నదో కనుక్కుంటే చెప్తుందనీ చూచాయగా అన్నది.

సరే ఏమైతే అదే అయిందని గుండెధైర్యంతో అక్కడనుంచి బయలుదేరాడు యువరాజు శేషు. తల్లిని మోసుకుంటూ నడచి వెళ్ళినప్పటి కష్టంకన్న యిప్పుడే లోటు మరొకవైపు రాము కనిపించలేదని దుఃఖం- అతని మనస్సు

ఎంతో క్రుంగిపోయింది. అయినా మొండిధైర్యంతో అలా రాత్రనక- పగలనక నడుస్తూనే వున్నాడు.

అలా వెళ్ళగా వెళ్ళగా కొన్నాళ్ళకు యువరాజు శేషు ఒక కొండదిగువకొచ్చాడు. అక్కడిప్రజలు ఆకొండను బ్రహ్మమానస పర్వతమని పిలుస్తారట!— దానిపైనే వున్న దట మత్స్యగుండం. శేషుకి కావలసిందికూడా అదేగా!

ఆ బ్రహ్మమానస పర్వతంపైనే ఒక పెద్ద గుహ కనిపించింది. శేషు ఎలాగోకష్టపడి ఆపర్వతాన్నెక్కి చూసాడు ఆ గుహపైన చిన్నకుటీరం ఒకటి కనిపించింది. ఆ కుటీరం చుట్టూ పెద్ద మడుగు, ఆ మడుగులోనే మత్స్యగుండం; గుండంనిండా స్వచ్ఛమైన నీరుంది. ఆ నీట్లో రంగు రంగుల చేపలన్నీ తళతళ మెరుస్తూ ఆడుతున్నాయి. వాటినిచూడగానే యువరాజు శేషుపడ్డకష్టమంతా పటాపంచలైపోయింది. ఐనా వాటిల్లో అసలు మత్స్యరాణి యెవరో అతనికి పాలుపోలేదు. అందుకని తన కమ్మని కంఠం విప్పి నింపాదిగా ఇలా పాడాడు :

"అత్తవే - మేనత్తవే
ఓ మత్స్యరాణీ పలుకవే
పిన్నవాణ్ణీ - బంధువుణ్ణీ
నిన్ను చూడగ వస్తినే!"

ఇలా పాడేసరికా గుండం మధ్యనుంచి మత్స్యరాణి బయటికొచ్చింది. "ఎవరు నాయనా! నువ్వు?" యింత దూరం వచ్చావు? అంటూ పరామర్శ చేసింది.

ఈ మాట వినగానే యువరాజు శేషుకి ప్రాణం లేచి వచ్చినట్టయింది. "అత్తయ్యా! మీ వాణ్ణే నేను. మా నాన్న గారు పాతాళ రాజ్యానికి మహారాజు!" అన్నాడు.

అది విని మత్స్యరాణి యెంతో సంతోషించింది. ఆ యువకుడు స్వయం తన మేనల్లుడే నని తెలుసుకుని పట్ట రాని ఆనందం పొందింది. వెంటనే ఆమె తగిన మర్యాద లన్నీ జరిపించి తన అంతఃపురం చూసేందుకు రమ్మని అతణ్ణి ఆహ్వానించింది. కాని యువరాజు శేషు ఆ అంతః పుర వింతలన్నీ చూస్తూ కాలం గడపడానికి కక్కడికి రాలే దుగా! అందుకని అతను గట్టుపైనుంచి దిగకుండా అక్కడే కూర్చుని, "అత్తయ్యా! తర్వాత వస్తాలే గానీ నాకొక చిన్న వుపకారం చేసిపెట్టాలి నా కెంతో ప్రియమైన నేస్తం మా నాన్నగారి కెంతో విలువైన అతిథీ అయిన ఒక అందాల అమ్మాయినేదో మాయ యెద్దు యెత్తుకుని పోయింది. అది యెటు వెళ్ళిందో నీకు తెలిస్తే కాస్త చెప్పుదూ!" అంటూ ఆప్యాయంగా అడిగాడు.

అప్పుడు మత్స్యకన్య అతని వైపు జాలిగా చూస్తూ అన్నది గదా, "నాయనా! ఎంతో కష్టపడి యింత దూరం వచ్చావు. అయిన వాడివి, ఆమాత్రం చెప్పలేక పోతానా? ఆ అమ్మాయిని వీపుపై కూర్చోబెట్టుకుని ఒక నా డిలాగే వెళ్ళిపోతూ వుండడం నేను చూశాను. అదుగో! చూశావా! అల్లంత దూరంలో ఒక చలువరాతి గుడిసె వుంది. దాంట్లోకి వెళ్ళావంటే చిన్న గుహా రంధ్రం కనిపిస్తుంది. ఆ రంధ్రంలో నుంచే ఆ యెద్దు పోయివుంటుంది. గుహలో నుంచి రకరకాల భయంకరమైన శబ్దాలు వస్తాయి. నువ్వేమీ

భయపడవద్దు సుమీ! ఏదయినా అనుమానం వస్తే వెంటనే నన్ను తలంచుకో నాయనా!"—

ఇలా ధైర్యం చెప్పేసరికి యువరాజు శేషు ప్రాణం లేచి వచ్చినట్టయింది. అతను మత్స్యరాణి వద్ద సెలవుపుచ్చుకుని జై పరమేశ్వరా అని బయల్దేరాడు. చలువరాతి కుటీరములో కెళ్లి నాలుగువైపులా చూశాడు. ఒకమూలను మాత్రం పెద్ద గుహారంధ్రం కనిపించింది. దాని చుట్టూ ఆకులూ-తీగెలూ దట్టంగా అల్లుకున్నాయి. వాటిని వూడ లాగి దారిచేసుకుని యువరాజు శేషు ఆ గుహారంధ్రంవైపు చూశాడు. ఆ ఫళంగా దాంట్లో నుంచి చల్లనిగాలి దభీమని పైకి విసిరింది. దాంతో శేషు వళ్ళంతా చల్లబడిపోయింది. అయినా భయపడకుండా అతను ఆ గుహలోకి దిగి నింపాదిగా బయలుదేరాడు.

ఆ గుహ అంతా నిశ్శబ్దం ఆవరించుకుని వుంది. అలా వుండి కొంతసేపటికల్లా హోరుమని ధ్వని పుట్టింది. ఆ గుహలో నుంచి వెలుపడే ధ్వని ఒక్కొక్కప్పుడు స్పష్టమైన మాటల్లాగ కూడా వినిపిస్తూ వుంటాయి. శేషుకూడా జాగ్రత్తగా వినగా వినగా ఆ హోరుమనే ధ్వనిలో యేవో మాటలు పుట్టాయి. ఆ మాటలే అతనికి మళ్ళీ మళ్ళీ వినిపించాయి. ఎంతదూరం వెళ్లినాఎన్ని సార్లయినా అదేధ్వని!

"చూసింది చాలు—చూసింది చాలు" ఇవేమాటలు—

అప్పుడు యువరాజు శేషు కేమీ పాలుపోలేదు. వెంటనే తన మేనత్త మత్స్యరాణిని మనసులో తలంచుకున్నాడు. ఘురుక్షణంలోనే ఆ గుహలో నుంచి మళ్లీ యేవో మాటలు వినిపించాయి.

"ఆవు వెంట వెళ్ళు ఆవు వెంట వెళ్ళు ఒంటి ఆవు ఆగిన చోటనే నీ కాపురం" అంటూ పదే పదే వినిపించ సాగాయి. అంత కంతకు ఆమాటలు తగ్గి గుసగుస లంత చిన్నగా వినిపించి మాయమయ్యాయి. యువరాజు శేషు మళ్లీ యేవేవో ప్రశ్న లడిగాడు. గాని వాటికి అతీ లేదు-గతీ లేదు. కొంతసేపు అలా నడిచి అతను గుహ పైకి చేరు కున్నాడు. పైకి వస్తే యేమీ కనిపించ లేదు. మళ్ళీ అతని ముఖంలో నిరాశ ఆవరించింది. ఇంకా ఎంత దూరం వెళ్ళ డమో అని దిగులు పడ్డాడు. అయినా ఏం చెయ్యగలడు పాపం?-అలా ముందు కెళ్తూ దార్లో కనిపించిన వాళ్ళందర్నీ-"అయ్యా! రాజకుమార్తెలాగ బట్టలు కట్టుకుని గాలికన్న వేగంగా పరుగెత్తే తెల్లని యెద్దుపై కూర్చుని పోతున్న చక్కనిచుక్క లాంటి అమ్మాయి యెక్కడైనా కనిపించిందా!" అంటూ అడుగుతూ వెళుతున్నాడు. కాసి గుహలో నుంచి వచ్చిన మాటలు తలంపుకి రాగానే అతను ఏదో అడగబోయి, ఏదో మాట్లాడుతూ గొణుక్కుంటున్నాడు. అది చూసి అక్కడి వారంతా ఇతని కేదో పిచ్చి పట్టిందేమో ననుకుని పోతున్నారు.

ఆ మోస్తరుగా యువరాజు ఎంతదూరం యెన్నాళ్ళు వెళ్లాడో చెప్పడం కష్టం. ఈ సంగతి అతనికే తెలియదేమో! ఒకనాడు హఠాత్తుగా అతనికి దార్లో మచ్చ మచ్చల ఆవు ఒకటి కనిపించినది. అది దారి ప్రక్కను పడుకుని నెమ్మదిగా నెమరువేస్తూ వుంది. శేషు దానిదగ్గర కెళ్ళేటప్పటికి అది నింపాదిగా లేచి నిలబడి తల కాస్త విదిల్చి ముందుకి వెళ్లి పోసాగింది. అప్పు డప్పు డది దార్లో ఒకొక్క గుప్పెడు

పచ్చిగడ్డిని నోట కొరుకుతో కాస్త ఆగుతూ .మరీ వెళ్తూ వుంది. దాని వెంటబడ్డాడు యువరాజు శేషు. అది నింపాదిగా ధీమాగా నడచిపోతూ వుండడం మూలాన అసలు తనకు దారి చూపించవలసిన ఆవు అవునో కాదోనని అనుమానం వేసింది. అందుకని యువరాజు శేషు బిగ్గరగా అరుస్తూ, "ఆవూ! ఓ మచ్చల ఆవూ! నామంచి ఆవూ! కాస్త ఆగుదూ! నీకు పుణ్యముంటుంది" అంటూ పిలిచాడు.

ఆ యావు మామూలు ఆవుల లాంటిదో లేకపోతే లేశా యేదైనా వున్నదో కనిపెట్టాలని అతని ఆరాటం! అయినా దాని నడక వ్యవహారం అంతా చూస్తూంటే అది మామూలు ఆవు లాగానే వుంది. అతను నింపాదిగా నడిస్తే అదీ మెల్లగానే నడుస్తూవుంది. అతను జోరుగా నడిస్తే అదీ జోరుగానే నడుస్తూ వుంది. అతను పరుగెత్తి దాన్ని కలుసుకోబోగా ఆవు కూడా కాళ్ళు జాడించి, తోకపైకెత్తి గబ గబా పరుగెత్తింది.

ఇక దాన్ని కలుసుకోవడం యువరాజు శేషుకి కష్టమనిపించింది. అందుకని మెల్లగా నడవడం మొదలెట్టాడు. దాంతో ఆవు కూడా మెల్లిగానే నడవసాగింది. ఇంతకూ అది వెనక్కి తిరిగి చూడనైనా చూడలేదు. మరి అతను మెల్లగా నడుస్తూన్నట్టూ వడిగా వస్తున్నట్టు దానికెలా తెలుస్తుందో! గమ్మత్తుగా వుంది. పచ్చిగా పచ్చగా వున్న చోట అది ఒక కడి నెమరు వేసుకుంటూ, దార్లో ఎక్కడైనా సెలయేరుగాని, నదిగాని యేదైనా కనిపిస్తే దాంట్లో నీరు త్రాగుతూ, తలయెత్తి వూపిరి విడచి మళ్లీ త్రాగుతూ

ప్రయాణం చేస్తూవుంది. యువరాజు శేషు యెంత వేగంగా వెనక వెళుతున్నాడో, దాన్నిబట్టే అది కూడా నడుస్తూవుంది.

అది కావలసిన ఆవో లేకపోతే మరొకటో, ఏదయినా ఎక్కడో ఒకచోట ఆగవలసిందేగదా! ఆ గుండె నిబ్బరంతోనే శేషు దాని వెనక కొన్ని యోజనాల వరకూ నడచి వెళ్లాడు. ఆఖరి కతని కాళ్ళు గంట్లుపడిపోతున్నాయే కాని అది ఆగడం కనిపించదు. 'ఆవా ఓమచ్చల ఆవా! ఆగవా?' అంటూ అతనెంత గట్టిగా కేకలువేసినా అది ఆగలేదు. ఆఖరి కతనికి యేడుపు కూడా వచ్చింది. అయినా ఎంత దూరమైనా ఎంత కష్టమైనా దానివెంట వెళ్లే తీరాలని నిశ్చయించుకున్నాడు. ఆ యావులో మరే ఆకర్షణ శక్తి వుందో గాని అతణ్ని సూదంటు రాయిలాగ తన వైపుకి లాక్కోవడం మొదలెట్టింది.

అందులో ఒకరహస్యంవుంది ఆయావు ఒక మాయావు దానివెంట నాలుగడుగులు వేసిన వారంతా దాన్ని ఇక విడువలేరు. వారికి తెలియకుండానే వారు దాని మాయలో పడిపోతారు. సూదంటురాయి ఎన్ని సూదుల నయినా యిట్టే తన వెంట లాక్కుంటున్నది. అది వెళ్ళే దారులు కూడా అంత మంచివికావు. ఒకప్పుడు ఏటవాలుగా వుండే గుట్టలు-ఇంకొకప్పుడు బురద గుంటలు-మరొకప్పుడు ముండ్ల పొదలు-ఇలాంటి దారులలో నడవవలసివచ్చింది. శేషు బట్టలు చినిగిపోయాయి. కాళ్ళు తెగిపోయాయి. వళ్ళు గీరుకుపోయినొప్పులతోపచ్చడిపచ్చడిఅయింది. పైగా మరొక పక్క ఆకలితో కడుపు కాలిపోతూవుంది. ఇంత అవస్థగా వున్నా యువరాజు శేషు ఆ యావు వెంట వెళ్ళడం మానుకో

లేదు. అతని దృఢనిశ్చయాన్నిచూసి దార్లో జనం చాలా మంది తోడయారు అతని కథంతా విన్నారు. అతనిపైని వారికి జాలికలిగింది. అతగాణ్ణి యెప్పుడూవిడువకుండా, అతని కేయాపద కలిగినా ఆదుకోవాలనీ. ఆవు ఎక్కడయితే ఆగుతుందో అక్కడ ఒక పెద్ద పట్టణం కట్టి అతనికివ్వాలని వారంతా సంకల్పించుకున్నారు. ఆ పట్టణానికి నట్టనడుమ నొక పెద్దకోట కట్టించాలనీ, అందులో అతణ్ణిపెట్టి, రాజును చేసి ఆ రాజ్యానికి పట్టాభిషేకం చేయాలనికూడా వారు తలపెట్టారు. మంచి మనసుగలిగిన యువరాజు శేషు ఆ ప్రజల అండదండలను చూసి తనకు మంచి రోజులు వస్తున్నాయని తెలుసుకున్నాడు స్వతహాగా రాజకుమారుడు!

అలా వారితోమాటాడుకుంటూ ఆ యావు వెంట నడిచివెళ్ళడం వల్ల అతని కంత అలసట అనిపించలేదు. కొంతదూరం వెళ్లేసరి కా ఆవు ఒకచోట చక్కా పడుకుంటున్నది. అదిచూడగానే యువరాజు శేషు మనసు కాస్త కొమ్మది పడింది. పక్కనున్న జనమంతా ఆనందంతో చప్పట్లుకొట్టారు. ఆ యావు ఒకసారి అటూ యిటూ కలియజూసి, నింపాదిగా ముందు కాళ్ళు ముందు వంచి, తర్వాత వెనుక కాళ్ళు వంచి అక్కడి పచ్చికపైని వళ్ళు వాల్చింది. యువరాజు శేషూ, తక్కినవారూ దాని చేరువకొచ్చి చూశారు. అదకూడా అదురు బెదురు లేకుండా హాయిగా నెమరువేస్తూ వారివైపు చూసింది. అప్పుడు యువరాజు శేషు మనసులో "ఓహో! ఇదే కదా నేను కాపురం వుండవలసిన చోటు" అనుకుని ఆ చుట్టూ చూశాడు. అది ఎంతో సారవంతమయిన ప్రదేశం చుట్టూ పెద్దపెద్ద చెట్లు చల్లని

నీడ నిస్తున్నాయి. కొండలు దట్టంగా అలముకున్నాయి. కొంత దూరాన ఒక యేరుపారుతూ ఎండలో తళ తళ మెరుస్తూవుంది. శేషు కక్కడ చిన్న ఇల్లు కట్టుకుని వుండా లని బుద్ధిపుట్టింది. అక్కడ అతని కెంతో హాయి అనిపిం చింది. అందుకని తన నేస్తాలందర్నీ పిలిచి తనతో బాటు గానే అక్కడ ఇళ్లు కట్టుకొని వుండమని కోరాడు. ఆలాగే నన్నారు వారంతా;—

బాగా ఆకలి వేస్తుందేమో, వారంతా ఆ చుట్టుపట్ల నున్న తోటలకెళ్లి మంచి మంచి పళ్లు తీసుకొచ్చారు. యువరాజు శేషు వారితో బాటు పళ్ళుతిని కాస్త యేటినీరు కడుపులో పోసుకున్నాడు. మిగతా శేషు వాళ్ళంతా ఇళ్ళకై కలప కట్టుకొచ్చేందు కెళ్ళిపోయారు. బడలిక తీర్చు కుందుకి ఆ ఆవు ప్రక్కను నేలపై కాళ్ళుచాచి పడుకున్నాడు. తన రాజ్యం వదిలింది లగాయతు అంతవరకూ అతను పొందిన ఆయాసం అప్పుడే ముంచుకొచ్చింది. కానైతే అంతలో ఎక్కణ్ణుంచో అతనికి కేకలు, అరుపులు, మొర్రలు వినిపించాయి. ఎవరు చెప్మా అని గబుక్కున లేచి చూశాడు. ఇంకేముంది? తన క్రొత్తనేస్తాలు భయంతో అరుస్తూ అటూ ఇటూ పరుగెత్తుతున్నారు. మధ్యమధ్య రంపంపెట్టి కోస్తు న్నట్టు బుస్సు బుస్సు మనే శబ్దంకూడా అతనికి వినిపించింది.

యువరాజు శేషు వెంటనే తన కత్తిని పట్టుకుని ఆ తోటవైపుకి పరుగెత్తాడు. ఆ గందరగోళమంతటికీ కారణం ఒక గొప్ప పాము. దానికి చింతనిప్పుల్లాంటి కళ్ళు పెద్ద పెద్ద దవడలు. ఆ దవడల మధ్య వాడి అయిన కోరలువున్నాయి.

శేషు అక్కడి కెళ్లేలోగా అది తన నేస్తాలు చాలామందిని పొడిచి చంపి గుటక కొక్కడి చొప్పున మింగివేసింది.

ఆ తోటలోవుండే చిన్నమడుగు ఒక భూతానిది. ఆ భూతం భయంకరమైన సర్పంగా మారి ఆ మడుక్కి కాపలా కాస్తూ ఎవ్వరినీ దాంట్లో నీరు త్రాగకుండా చూస్తూ వుంది. చుట్టుపట్ల వుండేవారికి యీసంగతి తెలుసు. అందుకే ఆ యిరుపంచలకు కూడా రారు. ఆ పాముకి నరమాంసండొరక్క ఎన్నోవందల సంవత్సరాల నుంచీ ముఖంవాచింది. అది నిండు భోజనం తిని అప్పటికప్పుడే వంద సంవత్సరాలయి పోయింది. అందుచేత అది ఆకలితో అవు-రావురు మంటూ వుంది. అంతవరకూ తిన్న మనుషులు దాని కడుపులో ఒక్క-ప్రక్కకుకూడా రాలేదు. అందువల్ల యువరాజు శేషు తన కంటబడగానేఅదిబుస్సుమని లేచి, పెద్దకొండగుహలాంటినోరు తెరచింది; ఆ నోటిలో ఆఖర్న మింగిన మనిషి తాలూకు కాళ్లు కనిపిస్తూనే వున్నాయి. తన నేస్తాలను పొట్టను బెట్టు కున్నందుకు యువరాజు శేషుకి దానిపైని పట్టరాని కోపం వచ్చింది. అందుకని దాని పెద్దనోటికి జడియలేదు. దాని వందలాది కోరలను చూసి బెదరలేదు. తనకత్తిని పైకి తీసి దాని ముందుకి గభాల్న వురికాడు. కాని కొండంత పాము దగ్గర నలుసంతమనిషేమాత్రం?—అమాంతం అది తన తోకతో అతణ్ని క్రిందను పడద్రోసి ఒక్కవూపున మింగి వేసింది. పాపం యువరాజు శేషు ఇంతదూరం వచ్చి ఆ భూతం పాముకి బలియైపడిపోయాడు.

కాని లోగడ ఒకసారి పెద్దచేప తననూ, రామునూ మింగివేసినప్పుడు చేసిన వుపాయం యువరాజు శేషుకిబాగా

జ్ఞాపకంవుంది. అందుకని ఆ పాము కడుపులో చాలాసేపు అటూ ఇటూ గింజుకొని నింపాదిగా తన కత్తితీసి దానిపొట్ట జర్రున చీరి గభాల్న బయటికొచ్చాడు. దాంతో కొండంత వున్న ఆపాము రక్తాలు కార్చుకుంటూ చచ్చి వూరుకుంది. అది క్రిందపడి పడడంతో పెద్ద పిడుగుపడ్డంత చప్పడయింది. ఆ పామును చంపినందుకు శేషుకి సంతోషం కలిగినా, తనతోవచ్చిన మిత్రులంతా దానివాతబడి చచ్చిపోయినందుకెంతో విచారించాడు. అక్కడొక చిన్న గుడిసె కట్టుకుందామనుకున్నా తనకు తోడెవ్వరూ లేరాయెనే !

అంతలో "శేషూ! - దిగులుపడకు- ఆ పాము దంతాలను వూడబెరికి భూమిలోపాతు" అంటూ ఏక్కడనుంచో ఒక ధ్వని వినిపించింది అయితే ఆ గొంతుమాత్రం మత్స్యరాణిదని అతను ఇట్టే కనిపెట్టివేశాడు.

అబ్బా! ఎంతకష్టమైన పని!— చచ్చిపోయిన ఆ పామే పెద్దపర్వతంవంటిది. దాని కోరలు వూడలాగడమంటే మాటలతో పనికాదుమరి!— అయినా యువరాజు శేషు యెంతో తంటాలుపడి ఆ పాము కోరలు లాగాడు. కాని అవి యెంతకూ వూడిరాలేదు. అప్పుడతను దాని తలను పెద్ద రాతితో చితకగొట్టాడు. అలా కొట్టగా కొట్టగా ఆరు రోజులకు రెండుపోలల కోరలుమాత్రం దొరికాయి. అయితే వాటిని భూమిలో పాతడం ఇంకొక మహాకార్యం!- అసలు దాన్ని చంపటమే కష్టం! పైగా శేషు ఆరురోజులపాటు నిద్రాహారాలు లేకుండా దానికోరలు లాగడంతోనే గడిపి బాగా అలసిపోయాడు. మళ్ళీ భూమినిత్రవ్విదాంట్లో ఆ పాము కోరల్ని పాతాలి. అయినా యువరాజు శేషు తనదీక్ష వదల

లేదు. ఎన్నో పాట్లుపడి భూమిని తన కత్తితోనే దున్ని దాంట్లో పాముకోరల్ని నాటాను. వెంటనే ఇంకేముంది! భూమిపైని యేదో తళతళమని ఒకచోట మెరిసింది. అలా మరొకచోట- ఇంకొకచోట- వందచోట్ల- వెయ్యిచోట్ల- ఆ భూమి అంతటా ఆ తళతళలే కనిపించసాగాయి. కొంతసేపటికల్లా అవి బల్లేలకొనల్లాగా కనిపించి అంతకంతకు భూమిపైకి లేచాయి. అఫళంగా గబుక్కున ఎన్నెన్నో కత్తులు బయటికొచ్చాయి. మరి కాస్సేపటికి ధగధగలాడే ఇనుప టోపీలు వేలకొద్దీ నేలనుపగుల్చుకొని వచ్చాయి. ఆతర్వాత ఆటోపీల క్రింద మనుష్యుల ముఖాలు కనిపించాయి. కన్నుమూసి తెరిచే లోపల ఎక్కడ చూసినా లెక్కలేనంతమంది సిపాయిలు కిక్కిరిసి నిలబడి వుండడం కనిపించింది. గమ్మత్తుగావుంది కదూ యీ మనుషులపంట!-యువరాజు శేషు ఆలోచించుకునేందుకు వ్యవధికూడా లేదాయెను! అంత వేగంగా అంతమంది సైన్యం భూమిలోనుంచి పుట్టుకుని వచ్చారు. ఆ సిపాయిల తలలకు యినుపటోపీలు, వంటినిండా కవచాలు, చేతుల్లో కత్తులూ, కటారులూ, డాళ్ళూ, యెన్నెన్నో వున్నాయి. భూమిలోనుంచి పుట్టి పుట్టగానే వారు కత్తుల్ని ఝళిపిస్తూ యుద్ధానికి తలపడ్డారు.

"భలే! యిది మరీ విడ్డూరంగా వుంది. వాళ్లు పుట్టడమెక్కడ?-అప్పుడే యుద్ధం చేయడమెక్కడ?-ఏదో కొంప మునిగిపోయినటు రణగొణ ధ్వని చేయకపోతే యేంపోయిందో?-ఇలా ఆ పాము కోరల్లోనుంచి అంతమంది క్రూరమైన మనుష్యులు బయలుదేరారు. వారితోబాటు చాలమంది బాకాలూదేవారూ - భేరీలు కొట్టేవారూ కూడా

భూమిలోనుంచి పైకొచ్చారు. వారు పుట్టగానే బాకా లూదుతూ - డోళ్ళుకొడ్తూ ఒకటే రణగొణధ్వని ప్రారంభిం చారు. ఇక ప్రదేశమంతా పెద్ద కురుక్షేత్రమై పోయింది. ఆ సైన్యం కళ్లన్నీ చింతనిప్పులాగ వెలుగుతూ ప్రపంచ మంతటినీ మింగివేసేటంత కోపంగా వున్నాయి.

అంతలో మళ్లీ యువరాజు శేషుకేదో ఆకాశవాణిలా వినిపించింది. "రాజకుమారా, ఆ సిపాయిల మధ్య కొక రాయిని వేసి చూడు అంటూ"-శేషు ఆఘళంగా ఒక పెద్ద రాతినితీసి వారి మధ్యను పడవేశాడు. అది ఆసిపాయిల్లో ఒక అతనికి తగిలింది. దాంతో వాడికి మహాకోపం వచ్చింది. ప్రక్కనున్నవాడే ఆ రాయి వేశాడని గ్రుడ్లెర్రజేసి కత్తితో వాడి తల కసక్కున నరికి వేశాడు. దాంతో ఆ జగడం నింపాదిగా సైన్యం సైన్యమంతటికీ అంటుకుంది. సిపాయి లంతా కత్తులు ఝుణఝుణ మనిపిస్తూ. ఒకర్నొకరు నరు క్కోవడం మొదలెట్టారు. ఒక్కగడియలో సిపాయిలంతా చచ్చి అరటి బోదుల్లాగ క్రింద కూలిపోయారు. అలా యేడు పగళ్ళూ-యేడు రాత్రులూ యుద్ధం యెడతెరిపిలేకుండా జరి గింది. సిపాయిల తలలన్నీ పెద్ద పెద్ద కొండల్లాగ పోగుపడి పోయాయి. అన్నివేలమందిలో అయిదుగురు సిపాయిలు మాత్రోం ఆఖరికి మిగిలారు. వారుకూడా అయిదుమూలల నుంచీ వచ్చి 'ఢీ' మంటూ కత్తియుద్ధానికి తలపడ్డారు.

అంతలో మళ్లీ ఆకాశవాణిగా మత్స్యరాణి అరుపు వినిపించింది. "మేనల్లుడా! శేషూ! ఆ అయిదుగురు సిపాయిలనూ జగడం మానుకోమని చెప్పు. వారు నీ కిక్కడ అందాల పట్టణాన్ని కట్టి యిస్తారు."

ఇది విని యువరాజు శేషు వెంటనే ముందుకెళ్ళి ఆ సిపాయిలను సమీపించి- "ఇదిగో! ఆపండి యుద్ధం - మీ కత్తుల్ని ఒరల్లో వేసుకోండి" అంటూ ఖడ్గాన్నెత్తి సింహ గర్జనతో గంభీరంగా ఆజ్ఞాపించాడు. ఆ గర్జనకు సిపాయిలు బెదరిపోయారు. వెంటనే తమ కత్తుల్ని ఒరల్లో నుంచుకుని అతనికి వంగి దండాలు పెట్టి యెంతో వినయంగా నిలబడ్డారు. ఈ అయిదుగురు ఆ క్రూరసర్పం తాలూకు పెద్ద పెద్ద కోరలకు పుట్టినవారు. అందుకనే వారు అందరికన్నా బల మయినవారు. సాహసవంతులు, భూతాలంత యెత్తయినవారు. తెల్లమొహాల్లాగ నిగనిగలాడుతూ శేషును రెప్పవేయకుండా "చిత్తం చిత్తం" అనుకుంటూ చూడసాగారు.

అప్పుడు యువరాజు శేషు వారినిపిలిచి, "రండయ్యా! సిపాయిలూ రండి. మంచి వస్తాదుల్లాగ వున్నారు. అందుకని మీరొకపని చేయాలి. మీ కత్తులతో రాళ్ళు త్రవ్వి యిక్క-డొక అందమయిన పట్టణం కట్టండి. ఇదే నా ఆజ్ఞ" అని చెప్పాడు.

ముందా సిపాయిలు కొంచెం గొణుక్కు-న్నారు. ఇంత వరకూ యెవర్నో ఒకర్ని హతమార్చడం-యేదో పట్టణాన్ని కూల్చివేయడం ఇదే వారి పని, కాని యిప్పుడు పట్టణం కట్టాలనేసరికి వారు కాస్త వెనకదీశారు. కాని మళ్ళీ యువరాజు శేషు కళ్ళెర్రజేసి ఒక్క- అరుపు అరిచేసరికి వారు మళ్ళీ లొంగి పోయారు. ఇక తమ ఆటలు సాగవని తెలుసుకుని అతనేం చెప్తే అది చేసేందుకు తయారయారు. తమ బలమంతా వుపయోగించి కొండలన్నిటినీ పిండిగొట్టి అక్క-డ అంద మయిన నగరం ఒకదాన్ని నిర్మించారు. తమకుకూడా

అయిదు చక్కని యిళ్లు కట్టుకున్నారు. ఇంకా మిగతా ఇళ్ళన్నీ కట్టి మర్నాడుదయం శేషుకి మంచి కోట, కట్టాలను కున్నారు. ఆ రాత్రి వారంతా నిద్రపోయారు.

మర్నాడు తెల్లవారగనే శేషు లేచి ఆ అయిదుగుర్నీ వెంటబెట్టుకుని తనకు కోట యెక్కడ కట్టాలో చూసుకునేందుకు వెళ్లాడు. కాని అతని కక్కడ యేం కనిపించిందో తెలుసా? ఈ లోకంలో యెక్కడా లేని అందమయిన చలువ రాతి మేడ ఆ ప్రదేశంలో రాత్రికి రాత్రే లేచి వుంది. ఆకాశమంత ఎత్తు చుట్టూ కోట బురుజులు—ముందు పెద్ద సింహద్వారం—చుట్టూ స్థంభాలు—ఆ స్థంభాలపై రంగు రంగుల దీపాలు—ఇక ఒక టేమిటి?—రాజాధిరాజుల భవంతుల కేమాత్రం తీసిపోనట్టుగా వుంది. వేలాదినుంచి సిపాయిలు కత్తులతోనూ—కటారులతోనూ భూమి లోపలినుంచి పైకి రావడాని కెంతసేపు పట్టిందో ఈ అద్భుతమయిన కోట లేచేందుకుకూడ అంతసేపే పట్టింది. అందచందాలు చూసి యువరాజు శేషు యెంతో ఆనందించాడు. వెనుకనున్న అయిదుగురు సిపాయిలూ వెంటనే జయజయధ్వానాలు చేశారు. జయజయ శేషుమహారాజా—స్వాగతం రాజాధి రాజా—ఇదుగో—ఇదే మీ కోట. ఈ కోటలో చిరకాలం సుఖంగా వర్ధిల్లండి'' అంటూ అరిచారు. శేషు ఇప్పుడు యువరాజు కాడు. ఆ క్రొత్త నగరానికి మహారాజు. అతను కోట మెట్లె క్కాడు. అతని వెంట అయిదుగురు సిపాయిలూ బారులు తీర్చి నడచి వెళ్ళారు. కోటలో అడుగు పెట్టగానే శేషుకి కమ్మనిపాట వినిపించింది. ఎవరిది చెప్మా అని అతను నాలుగు వైపులా తేరిపార చూశాడు. చాలాదూరాన ఒక

అమ్మాయి కనిపించింది. ఆమె అందం చూడగానే అతని కళ్ళు మిరుమిట్లు గొలిపాయి. ఆమె వారివైపుకే వస్తూవుంది. బంగారు బట్టలు కట్టుకుంది. వజ్రకిరీటం పెట్టుకుంది. అమూల్యమయిన ముత్యాలదండ మెడలో వేసుకుంది. ఆమెని చూడగానే శేషుకెంతో ఆనందమనిపించింది. ఆమెను తేరిపార దీక్షగా చూశాడు. అక్షరాలా తన ప్రియురాలు రాము!—ఇంకేం ?—తను యెవరికోసమయితే ఇంత దూరం నడిచి ఇన్ని ప్రయాసలకోర్చి వచ్చాడో ఆమె తనకెదురుపడింది. ఆమెను మళ్లీ మళ్లీ చూశాడు. రాముకూడా శేషును గుర్తుపట్టింది. ఎన్నో యేళ్ళ క్రిందట విడిపోయిన జంట మళ్ళీ కలుసుకున్నారు. ఆమె పొందిన ఆనందం ఇంకేమని చెప్పాలి. శేషు ఆమెను అతి ప్రీతితో కౌగలించుకున్నాడు. అతణ్ణి కిల్లాడి రాము యెంతో ఆదరించింది. మంచిమంచి విందుభోజనం పెట్టింది. అప్పుడామె క్షేమ సమాచారాలన్నీ అడుగుతూ అక్కడికొచ్చిన వైనమేమిటో చెప్పమని అడిగాడు రాజకుమారుడు శేషు—

అప్పుడు కిల్లాడి రాము అన్నదిగదా, "రాజకుమారా! ఏమని చెప్పను నా అవస్థ. ఆ యెద్దు సముద్రంలోకి దూకింది గదా! అప్పుడు భయపడి నేను కళ్ళు మూసుకున్నాను. మళ్లీ తెరిచేసరికి ఇదిగో! ఈ మహల్లో వున్నాను. అంతే- మధ్యదాన్లో యేమయిందో తెలియదు. అసలా యెద్దు మామూలు యెద్దులవంటిదికాదు. రాక్షసియెద్దు. ముఖం మాత్రం యెద్దు ముఖం. మిగతాదంతా రాక్షసాకారం. శేషూ ఆ వేళ నువ్వువద్దు వద్దంటే వినకుండా వచ్చాను. ఇన్ని అవస్థలిక్కడ పడ్తున్నాను. ఆ దుర్మార్గుడు నన్ను

బలవంతంగా పెళ్లి చేసుకోవాలని చూశాడు. కాని నేను యుక్తిగా తప్పించుకుని తిరుగుతున్నాను. పాటలు పాడే చెట్టును తీసుకొచ్చి పెళ్లి చేసుకుంటానన్నాను. అలా వెళ్లి పోయిన ఆ యెద్దు రాక్షసుడింతవరకూ తిరిగిరాలేదు. ఈ మహాలు పగలు మాత్రం పైకి లేస్తుంది. రాత్రుళ్లు మళ్లీ భూమి లోపలి కెళ్లిపోతుంది. ఇంతకూ వాడు వెళ్లి చాన్నాళ్లయింది. వచ్చేక ఏం అఘాయిత్యానికి తలపెడ్తాడోనని బెంగపెట్టుకుని వున్నాను."

రాజకుమారుడు శేషు ఆమెకి ధైర్యం చెప్పాడు తను ఆ రాక్షసుణ్ణి హతమార్చి ఆమెను ఇంటికి తీసుకెళ్తానని మాటయిచ్చాడు. ఆమెతో అలా మాట్లాడుస్తూ వుండగానే చీకటి పడిపోయింది. అంతలో ఆ భవంతి కొద్ది కొద్దిగా భూమిలోపలికి వెళ్ళిపోవడం కనిపించింది. అప్పుడు శేషు తనుబయటే వుంటానని చెప్పి, ఆ మహాలు వాకిట్లోకి వచ్చివేశాడు. మరికొంతసేపట్లోనే ఆ భవంతి అమాంతంగా భూమిలో కెళ్లిపోయింది.

రాజకుమారుడు శేషూ-అతనితో వున్న అయిదుగురు సిపాయిలూ బయటపడి ఆ వింతను చూశారు. అక్కడిప్పుడు కోటాలేదు, పేటాలేదు. పెద్ద మయిదానం మాత్రంవుంది. ఆ ప్రదేశం యేదో విడ్డూరంగా వుందని శేషు వారిని వెంట బెట్టుకుని యింకా ముందుకెళ్ళాడు. చీకటి బాగాపడింది. అందుకని ఒక చెట్టుక్రింద అతను సాగవారి విశ్రమించాడు.

సరిగ్గా అర్ధరాత్రి కావచ్చింది. అతను పడుకున్న చెట్టుపైని గబుక్కుని కలకలమనే చప్పుడయింది. ఏమిటో

చెప్మా అని లేచి చూసేసరికి ఆ చెట్టుపైని ఒక పిట్ట రెక్కలు తపతపమని కొట్టుకుంటూ యెగిరి అతని వైపుకొచ్చింది. పిట్ట యెంతో ముద్దులు కులుకుతూ వుంది. దాని రెక్కలూ, వొళ్లూ యెరుపు, కాళ్లుమాత్రం పసుపు. మెడచుట్టూ బంగారం సెంట్రుకలున్నాయి తలపైని చిన్న కిరీటంలాగా బంగారంరంగు కుచ్చువుంది. రాజకుమారుడు శేషు ఆ పిట్టను పట్టుకోబోయాడు. కాని అది నింపాదిగాయెగురుతూతప్పించు కునిపోయి జాలిగా అరచింది. ఎందుకో పాపం అది విచారంగా వుంది. మళ్లీ దాన్ని పలుకరించాడు కాని ఆ పిట్ట యెంతకూ మాట్లాడలేదు. ఏమడిగినా అది "పీప్-పీప్-పీప్" అని మాత్రం జవాబు చెప్తూ వుంది. ఏమిటి 'పీప్-పీప్-పీప్' తాలూకు అంతరార్థం? పోనీ, దానితో మనకేం పని అని శేషు వెళ్లిపోయేందుకు ముందుకడుగు వేసేసరికది మళ్లీ జాలిగా అదే అరుపు అరుస్తూ, తన యెర్రని రెక్కల్ని తప తప కొట్టుకుంటూ వచ్చి అతణ్ణి యెలాగోలాగు వెనక్కి మళ్లిస్తూ వుండసాగింది. ఏమిటో దానిభావం? రాజకుమారుడు శేషు కదేమి అవగాహన కాలేదు. ముందుకెళ్తే యేదయినా ఆపద ముంచుకొస్తుందని చెప్పేందుకది అలా చేస్తుందో యేమిటో మరి! సరేనని అతను ఆ రాత్రంతా అక్కడే కూర్చున్నాడు.

తెల్లవారగనే అతను లేచి సిపాయిలతో మళ్లీ అక్కణ్ణుంచి బయలుదేరాడు. దార్లోనున్న ఒక చిన్నగుట్ట పైకెక్కి నాలుగువైపులా కలయజూశాడు. చాలా దూరాన అతని కేదో పెద్ద మేడ బురుజులున్నట్టు కనిపించాయి. ఆ మేడ, పాలమీగడవంటి తెల్లటి రంగుతో దట్టమయిన తోట మధ్య

కనబడుతూవుంది. తోటలో పోకచెట్లు దట్టంగా కమ్ముకుని వుండడంమూలాన అది కనిపించీ కనిపించకుండా వుంది. ఆ మేడ, ఎంతో అందంగావుంది, యెంతో విశాలంగావుంది. అదెవరిదో రాజుదో యేమో! ఆ మేడపైని మెలికలు తిరుగుతూ నల్లటి పొగ లేస్తూవుంది. అంత ఎక్కువ పొగలేస్తూ వుందంటే వంట యింట్లో గొప్పగొప్ప విందు భోజనాలేవో జరుగుతూవుండాలిగా మరి !.

ఆ విడ్డూరమేమిటో చూడాలని రాజకుమారుడు శేషు ఉబలాట పడ్డాడు. కానయితే ఆ మేడదగ్గర కెళ్లేందుకు పెద్ద సముద్రాన్ని దాటాలి. అందుకని, అతను అయిదుగురు సిపాయిలనూ వెంటబెట్టుకుని సముద్రం ఒడ్డుకొచ్చాడు. అక్కడొక ఓడ తయారుగావుంది. దానిపై కెక్కి తెరచాప కట్టి బయలుదేరదీశాడు భయంలేకుండా రాజకుమారుడు శేషు.

ఇరవైనాలుగు గంటలా ఓడలో ప్రయాణం చేసి వారొక దీవి చేరుకున్నారు. ఆ దీవిలోనేవుంది శేషుచూసిన చలువరాతిమేడ - నింపాదిగా ఆ మేడవైపు బయలుదేరారు. వారలా వస్తూవుంటే యిదివరకటి పిట్ట మళ్ళీ అడ్డుకుంది. శేషుకి రాత్రి కనిపించిన పిట్టే అది.

ఎర్రని రెక్కలు, వళ్ళు, పసుపుపచ్చని కాళ్లు, మెడ చుట్టూ బంగారురంగు మచ్చ, తలపైని బంగారురంగుకుచ్చు శేషుకది విడ్డూరంగా వుంది. ఆపిట్ట శేషుతలపైని యెగుర్తూ అతని బుగ్గల్ని తనరెక్కలతో రాసుకుంటూ పోయింది. "పీప్ - పీప్ - పీప్ -" అనుకుంటూ అది ఇంకా అరుస్తూనే వుంది.

అలా అగుస్తూ అది మళ్ళీ తిప్పవైపు తిరిగిచూసింది. 'అయ్యో! ఆ మేడవైపువెళ్ళకండి, వచ్చినదారిని వెళ్ళిపోండి' అని బ్రతిమాలుకొంటున్నట్టు కనిపించింది. అది చూసి రాజకుమారుడు శేషు ముందుకెళ్లేందుకు తటపటాయించాడు. కాని అంతదూరం వచ్చి తిరిగిపోతే యెలా ?— అతను మళ్ళీ గుండెధైర్యం చేసుకుని యేమైతే అదే అయిందని ముందుకెళ్లాడు. ఆపిట్ట పాపం అరుస్తూ ముందు కెళ్లిపోయింది.

శేషూ ! సిపాయిలూ ముచ్చటగొలుపుతూ వున్న అక్కడి పచ్చని తోటలోనుంచి నడచుకుంటూ వెళ్లారు. ఉండుండి వారికి ఆకులసందుల్లోనుంచి ఆమేడ ఎంతో సొగసుగా కనిపిస్తూవుంది. అంతలో వారికొక విశాలమైన, శుభ్రమైన బాట కనిపించింది. ఈ బాటకు రెండుప్రక్కలా రకరకాల పువ్వులమొక్కలు కమ్మని వాసనలు కొడ్తున్నాయి. అవన్నీచూస్తూవుంటే అది దేవలోకంలోవుండే యే ఉద్యానవనమో అనిపిస్తుంది. ఆ వనంలో ఒకచోట తేటనీటికొలను కనిపించింది. దాహం తీర్చుకుందామని అయిదుగురు సిపాయిలూ ఆ నీటిని త్రాగారు. మరునిమిషంలో వారికి మత్తెక్కిపోయింది. వెంటనే స్మారకంతప్పి అక్కడే పడిపోయారు. నిజానికది నీరుకాదు. సారాయికొలను. అబ్బా! అంత సారాయి రోజూ త్రాగి మత్తెక్కేవాడెవడో గొప్ప రాక్షసి అయి వుంటాడు.

అయినా రాజకుమారుడు శేషు భయపడకుండా ఆ సిపాయిల నక్కడే వదలిపెట్టి మేడవైపుకి నడిచివెళ్లాడు. అది కూడా అతనికి గతరాత్రి చూసిన మాయమేడలాగే కనిపిం

చింది. దాని పనితనం చూస్తే యేదో దేవేంద్ర భవనంలాగ వుంది. అతను దాని గుమ్మంవైపు వడివడిగా అడుగులు వేసుకుంటూ వెళ్లాడు. ఇంకా అతను సగందూరం వెళ్లాడో లేదో యెదురుగా సింహాలు, పులులు, తోడేళ్ళు మందమందలుగా వచ్చిపడ్డాయి. కాని అవి క్రూరమృగాల్లాగ ప్రవర్తించలేదు. రాజకుమారుడు శేషుచుట్టూ సంతోషంతో గెంతుతూ, తోకల్ని అల్లల్లాడిస్తూ, తలల్ని ఆప్యాయంగా ఆడిస్తూ పెంపుడు కుక్కల్లాగ తిరుగాడడం మొదలెట్టాయి. అన్నిటికన్న పెద్దది, అడవికి రాజు అనిపించుకునే సింహంకూడా శేషు కాళ్ళు నాకుతూ నిలబడింది. అయినా మనిషి అన్నప్పుడు భయమెక్కడికి పోతుంది? అందుకని అవి ఎంత సాధు జంతువులుగా వున్నా అతను మనసులో మాత్రం కొంచెం దిగులుగానే వున్నాడు. అందువల్ల అవి క్రూర జంతువులే ననుకున్నాడు. అతను మేడవరకూ చేరుకునేదాకా అవి యేమీ అనలేదు. అతను మేడమెట్లు ఎక్కుతూ వుంటే మాత్రం అవన్నీ గుర్రుగుర్రుమని గొణగడం మొదలెట్టాయి.

అయినా రాజకుమారుడు శేషు ధైర్యంగా ఆ మేడలో ప్రవేశించాడు. అతనికి మొట్టమొదట కనిపించింది ఒక విశాలమైన చావడి. దానికి మధ్య నొక నీటికుండి. ఆ కుండీపైని నీటిని విరజిమ్మే యంత్రం. ఈ యంత్రంలో నుంచి పడుతున్న నీళ్ళు యెన్నెన్నో రూపాలుగా మారుతున్నాయి. ఒకొక్కప్పుడు ఆ నీళ్ళు మనిషిలాగ మరొకప్పుడు సింహంలాగ, అంతలోనే పులిలాగ, అప్పుడే తోడేలులాగ, గడియలోనే గాడిదలాగ మారిపోతూ వున్నాయి. ముఖ్యంగా

పందిరూపం మాత్రం ప్రత్యేకంగా కనిపిస్తూవుంది. ఆ పందిః నీళ్ళ కుండిలోపడి బురదలో పొర్లాడుతున్నట్లు కనబడుతూ వుంది. అది మంత్రమో - మహిమో మరి! అలా శేషు చూస్తూ వుండగానే అతని కొక కమ్మని కంఠం పాడుతూ వుండడం ఆ మేడలో ఇంకొక గదిలో నుంచి వినిపించింది. ఆ పాట లయతో ఆమె బట్ట నేస్తున్న ధ్వని కూడా కలిసివుంది. ఆమె మగ్గం దగ్గర పాడుకుంటుందో యేమిటో మరి !

మరికొంత సేపటికల్లా ఆ పాట ఆగిపోయింది. వెంటనే చాలామంది ఆడవాళ్ళు ఆనందంగా కిలకిలమంటూ వూసులాడుకోవడం అతనికి వినిపించింది. అప్పుడప్పుడు వారి పకపకలూ-వికవికలూ కూడా వినిపించాయి. ఎవరో ముగ్గురు నలుగురాడవాళ్ళు ఆ విడ్డూర మేమిటో కూర్చుని మాట్లాడుకుంటున్నట్టుంది. చూద్దాంగదా అని రాజకుమారుడు శేషు ఒక స్థంభంచాటున నింపాదిగా నక్కి కనిపెట్టసాగాడు.

అంతలో ఒక అందాల సుందరి తలుపుతీసి మళ్లీ వేసుకుంది. ఆమె లోపల బట్టలు నేస్తున్నది. అంతలో మ్మ్పైని మేడపై ఎవరోనడుస్తున్నట్లు కాళ్లచప్పుడయింది. తర్వాత వెండి గిన్నెలు బంగారు గిన్నెలు కదిలిన శబ్దం గలగలలాడింది. అది విని భోజనశాలలో యేదో విందు జరుగుతున్నదేమో ననుకున్నాడు. శేషు తిన్నగా కమ్మకమ్మని వాసనలు వస్తున్న గది దగ్గరకు వెళ్లి నింపాదిగా ఎవరికీ కనిపించకుండా తలుపు చాటున ఇరుక్కొని భోజనాలగదిలో ఏం జరుగుతూ వుందో కనిపెట్టసాగాడు. ఇంకేముంది. అక్కడ అయిదు సింహాసనాల పైన తన నేస్తాలు అయిదుగురు సిపాయిలూ

అంచకాల్క కూర్చుని వున్నారు. ముందు బల్లపైని వేసిన మాంసం గుట్టలుగుట్టలుగా పడివుంది. వారి ముందొక అంద మైన స్త్రీ ఒకామె బెత్తంపట్టుకుని నిల్చుంది ఆ సిపాయి లయి దుగురూ విందు భోజనాన్ని మస్తుగా తిన్నారు. జాడీలతో సారాయిని త్రాగారు. అయినా ఎంతకని తింటారు? కడుపులు పట్టాలా? అందుకని కొంతసేపటికి 'అమ్మయ్యా! ఇక చాలు' అంటూ ఆ స్త్రీవైపు భయంగా కళ్ళు వెళ్ళబెట్టి చూడసాగారు.

అది చూసి ఆమె కెంతో కోపం వచ్చింది. వారి వైపు గుడ్లెర్ర జేసింది. "ఛీ! మీరు మానవులుగా వుండేందు కర్హులుకారు" అంటూ ఆమె తన చేతిలో నున్న బెత్తాన్ని ఆడిస్తూ కాలితో నేలను తన్నింది. ఇక చూసు కోండి మరుక్షణంలో ఆ బంగారు గద్దెలపై కూర్చున్న అయిదుగురు సిపాయీలు అయిదు పందులుగా మారి పోయారు.

ఆ దృశ్యం చూసేసరికి యువరాజు శేషు గుండెలు ఝల్లుమన్నాయి. మరి కాస్సేపటికి పందులుగామారిన అతని సిపాయిలయిదుగురూ, పందుల దొడ్డిలోకి గబగబా పరుగు తీశాయి. శేషు తను యెవరికేనా కనిపించి వేస్తానేమో నని నక్కినక్కి అటూ యిటూ కాస్సేపు తారట్లాడుతూ తోటలో కెళ్ళి పోయాడు కొంచెంసేపు యేం చేయడమా అని ఆలో చించాడు. తనకు అంతవరకూ తోడుగావున్న అయిదుగురు సిపాయిలూ పందులై పోయారే అని విచారించాడు. ఆ మంత్ర గత్తె కంటపడ్తే తన గతీ అంతే అవుతుందేమోనని దిగులు పడ్డాడు. అయినా మళ్ళీ మరుక్షణంలోనే ధైర్యం తెచ్చుకుని మొలలో కత్తినీ, వీపున విల్లూ అమ్ములనీ, చేతిని బల్లేన్నీ

సర్దుకున్నాడు. "ఏమయితే అదే అయింది. నేను రాజ వంశంలో పుట్టినవాణ్ణి, అందుకని యీ మాయలాడి అంతుయేమిటో తెలుసుకోవాలి గాని పిరికి పందలాగ పారి పోవడం సజావుగా వుండదు" అనుకున్నాడు శేషు. అలా అని, అతను ఉద్యానవనంలో పచార్లు చేయసాగాడు. మళ్లీ పూర్వంలాగునే అదే యెర్రపిట్ట "పీప్ పీప్" - అని అరుచు కుంటూ, రెక్కల్ని తపతప కొట్టుకుంటూ అతనికెదురైంది, అతగాణ్ణి యెలాగైనా ముందు కెళ్లనివ్వకుండా చేయాలని యెనోన్నతంటాలు పడింది. అదిచూసి రాజకుమారుడు శేషు కేమీ బోధపడలేదు.

"ఏమిటే బుల్లిపిట్టా! నీ వెంట్రుకలు యెరుపు, మెడ చుట్టూ బంగారుమచ్చ, తలమీద బంగారుకుచ్చు, నీ వాలకం అంతా చూస్తుంటే యెవరో రాజవంశంలో పుట్టిన దాని లాగ వున్నావు. ఇంతకూ యేమిటి నీ వుద్దేశం ?- ఏంచెయ్య మంటావు అంటూ అడిగాడు. "పీప్...పీప్...పీప్" - అని మాత్రం చెప్పిందా చిన్నపిట్ట. దాని అరుపు చాలా విచార కరంగా వున్నది. దాని మనసులో ఏదో బాధ పడుతున్న ట్టుంది. అదే చెప్పాలని దాని తాపత్రయం కాని నోరు లేదు. అయినా దాని మాటలువింటూ కాలంగడపడం మం చిది కాదనుకుని రాజకుమారుడు శేషు ముందుకెళ్ళిపోయాడు. అలా ఉద్యానవనంలోనుంచి వెళ్తూవుండగా అతనికొక వింత మనిషి తారసపడ్డాడు. మంచి పడుచువాడు; చిన్న చొక్కా మాత్రం తొడుక్కున్నాడు. నెత్తిమీదనున్న టోపీకి రెండు రెక్కలున్నాయి. అతనికాళ్ళు నేలనుమోపకుండా గాలిలో తూలుతున్నట్టున్నాయి. అతని చేతిలోనున్న కర్రకు కూడా

రెక్కలున్నాయి. ఆ కర్రచుట్టూ రెండుపాములు చుట్టబెట్టుకుని వున్నాయి. అతనెవరో దేవతామూర్తిలాగ వున్నాడు. రాజకుమారుడు శేషు అతనికి చేతులుజోడించి నమస్కరించాడు.

అప్పుడా దేవతామూర్తి ఆనందించి,- "ఏం నాయనా! ఇది మాయదీవి అని తెలియదా!- అదిగో! ఆ చలువరాతి మేడలో ఒక మంత్రగత్తె ఉంటున్నది. ఆమె మాంచాల మహారాజు చెల్లెలు. పేరు మాధురి. ఆమె మంత్ర ప్రభావంతో మనుషుల్ని పశువులుగానూ యిట్టే మార్చివేస్తుంది" అన్నాడు.

రాజకుమారుడు శేషు ఆయనకు దగ్గరగావచ్చి. "స్వామీ! ఇందాక నా కెదురుగావచ్చిన చిన్న పిట్టకూడా ఒకప్పుడు మనిషేనంటారా?" అని అడిగాడు.

"అవును. అదికూడా ఒకప్పుడు మనిషే. ప్రాగ్జ్యోతిష పురం మహారాజు చాలా మంచిరాజు. తన యెర్రబట్టల్ని, మెళ్లోని బంగారు కంఠమాలనూ, తలమీద కిరీటాన్ని చూసి యెంతో మురిసిపోతూ వుండేవాడు. అందుకే అతనికిప్పుడీ సొగసైన పిట్టరూపు వచ్చింది. ఆ మహలుముందు నిన్ను చుట్టుముట్టిన సింహాలూ- పులులూ- తోడేళ్ళూ అన్నీకూడా ఒకప్పుడు క్రూరస్వభావం గలిగిన మనుషులే" అన్నాడా దేవతామూర్తి.

శేషు ఇదంతా విని ఆశ్చర్యపోయాడు. "అయితే! స్వామీ! ఆ మాయలాడిని గెలవడం యెలాగ?" అని అడిగాడు.

అందుకా దేవతామూర్తి ఫక్కున నవ్వి,- అలాగే నాయనా! అందుకే నేనిక్కడికొచ్చాను. నేను చెప్పినట్టుగా మాత్రం చేయి" అంటూ అటూ ఇటూ కలయజూసి ఒక మొక్కదగ్గరకెళ్లాడు. ఆ మొక్కకు ఒక్కటే ఒక్క పువ్వు వున్నది. ఆ పువ్వు దూదిలాగ తెల్లగావున్నది. దేవతా మూర్తి దాన్ని కోసి వాసనచూశాడు. ఆ పువ్వుని రాజ కుమారుడు శేషు కందిస్తూ,- 'ఇదిగో! ఈ పువ్వుని తీసుకుని దీన్ని నీ ప్రాణంతో సమానంగా చూసుకో!- ఇది విడ్డూరమైన పువ్వు. అమూల్యమైన పువ్వు - ప్రపంచమంతా వెతికినా ఇలాంటి దింకొకటి దొరకదు. దీన్ని నీ చేతిలో పట్టుకుని, మహల్లో వున్నంతసేపు, ఆ మంత్రగత్తెతో మాట్లాడుతూ వున్నంతసేపు వాసనచూస్తూవుండు. అంతేకాదు, ఆమె నీకు తినేందు కేవయినా పదార్థాలిస్తే, త్రాగేందుకు సారాయి ఇస్తే, నువ్వు ముఖ్యంగా యీ పువ్వుని మూచూస్తూ దీన్ని వాసన ముక్కునిండా పీల్చుకో!-అప్పుడా మాయలాడి మంత్ర తంత్రాలేవీ నీదగ్గర పనికిరావు తెలిసిందా!" అని చెప్పాడు.

తర్వాత ఇంకా యేం చెయ్యాలో అంతా రాజ కుమారుడు శేషు ఆయననుంచి తెలుసుకున్నాడు. ఆయనకు కృతజ్ఞతాపూర్వకంగా నమస్కరించి సెలవు తీసుకొని అక్కడనుంచి మంత్రగత్తె మహాలుకు బయలుదేరాడు. రెండడుగులు ముందుకు వేయగానే ఏదో అనుమానం వేసి ఆ దేవతా మూర్తి కోసం వెనక్కి తిరిగిచూశాడు. కాని విడ్డూరం!- ఆయన కనిపించలేదు ఎక్కడో మాయమై పోయాడు.

సరే! ఏమైతే అదే అయిందని శేషు మాయలాడి మహాలుకు బయలుదేరాడు. మహాలు ముందర మమూలుగా

ఇదివరకు లాగునే క్రూరమృగాలన్నీ అతని మీదికి ఎగ బడ్డాయి. కాని అవి క్రూర స్వభావం గలిగిన మనుషులేనని దేవతామూర్తి అతనికి చెప్పాడుగా! అందుకని అవి దూరంగా పారిపోయి అతను మహాలు మెట్లెక్కుతూ వుంటే అతనివైపు గ్రుడ్లుమిటకరిస్తూ చూస్తూ అరవడం మొదలెట్టాయి. సావిట్లో అడుగుపెట్టగానే శేషుకి మాయ జేత్తానా కంట పడింది. గది లోపల బట్టలు నేస్తున్న చప్పుడు వినబడింది. లోపల కమ్మగా పాటలు పాడ్తున్న అందాలరమణి కన బడింది, మిగతా చెలికత్తెల పకపకలు వినబడ్డాయి. ఇక ఆలస్యం చేయగూడదని శేషు ధైర్యంగా ముందుకెళ్ళి ఎదుటి తలుపుల్ని బాగా తీసివేశాడు. అతని అందాన్ని చూసి బట్టలు నేస్తున్న అమ్మాయి గబుక్కున లేచి అతని కెదురుగా వచ్చి చేతులు చాచింది. ఆమె చిరునవ్వులతో అతణ్ణి ఆహ్వానించింది. వంగి సలాములుచేసి అతనికి స్వాగతం పలికింది. మిగతా చెలికత్తెలంతా అతని ముందు కొచ్చి మోకాళ్లి నమస్కరించారు. అతణ్ని తమ రాణి యైన మాధురి గదిలోకి సగౌరవంగా ఆటలతో-పాటలతో తీసుకెళ్లారు.

మాయలాడి మాధురి అతని అంద చందాలు చూసి ఓ! వీరశూర పరాక్రమశాలీ! నమస్కారం. ఇదివరకు వచ్చిన వారు నీ సేవకులే ననుకుంటాను. వారు నా సత్కారం పూర్తిగా పొందారు. నీకూ అభ్యంతరం లేకపోతే నేను చేసే ఆతిధ్యాన్ని అంగీకరించి ఆ వెనకనుండే వంటింటికి రావచ్చు" అని చెప్పింది. బలే లీవిగా ముందు నడుస్తూ.

అలాగే నని రాజకుమారుడు శేషు కూడా ఆమె వెంట గ్రుడ్డులాంటి ఆకారం గలిగిన గదికెళ్లాడు. ఇంతకు ముందు తన అయిదుగురు సిపాయిలూ విందారగించి పండు లైన గది అదే! శేషు మాత్రం తన చేత్తో దేవతామూర్తి ఇచ్చిన పువ్వుని పట్టుకునేవున్నాడు. మాయలాడి మాధురితో మాట్లాడుతున్నప్పుడల్లా వాసన చూస్తూనే వున్నాడు. వంట గదిలో అతను అడుగుపెట్టాడు. సరిగ్గా గది మధ్యను ఒకే ఒక గద్దె వున్నది. అంతా బంగారంతో, తళతళ లాడ్తూ వుంది. నవరత్న ఖచితమైన గొప్ప విలువైన గద్దె, దానిమీద దిండు క్రొత్త గులాబీ పువ్వుల మెత్తదనంతో వొత్తుగావుంది. మంత్రగత్తె చరచరావచ్చి శేషు చేయి పట్టుకుని ఆ దివ్య సింహాసనం పైని కూర్చొబెట్టింది. తర్వాత చేతులు తట్టి తన పెద్ద వంటపుట్టిని పిలిచి, రాజు లుపయోగించేందుకు ప్రత్యేకంగా వుంచిన పంచపాత్రను రప్పించింది. తియ్యటి సారాయిని దానినిండా నింపి స్వయంగా శేషు కందించింది. కాని అతని మనసులో అను మానం పీకుతూనే వుంది. అందుకని ఆ సారాయివైపు తేరి పార చూచాడు. అది పైకి బుడబుడ లాడుతూ అంచున తెల్లటి బుడగలు కట్టింది. అందులో మాయలాడి మాధురి కలిపిన మందులే యెక్కువగా వున్నట్టు పసిగట్టాడు. ఆ మందులవల్ల సారాయి మరింత రుచిగా వుంది. అంచున కట్టిన బుడగల నురుగు వాసనే మనుషుల తల వెంట్రుకలెన్నో, పంది వెంట్రుకలగా గాని, వ్రేళ్లను సింహపు గోళ్లుగా గాని పళ్లను పులి కోరలుగా గాని మార్చివేస్తుంది.

ఇదంతా గ్రహించి రాజకుమారుడు శేషు తన ఎడమ చేతిలో వున్న తెల్లనిపువ్వును ముక్కుదగ్గర పెట్టుకుని గట్టిగా పీల్చాడు. దాంతో ఆ వాసన అతని గుండెలదాకా నిండి పోయింది. తర్వాత ఆ సారాయి అంతటిని త్రాగివేసి మంత్రగత్తెవైపు నిశ్చలంగా చూశాడు. ఇదివరకులాగ అతని మనిషి రూపు వెంటనే పోతుందనుకుంది పాపం మాయలాడి మాధురి. కాని ఆమె ఊహలన్నీ అపోహలై పోయాయి.

మంత్రగత్తెకి మరీ కోపంవచ్చింది. "ఛీ! ఈ క్షణం లోనే నక్కవై పోతావులే!" అంటూ తన బెత్తంతో గట్టిగా కొట్టింది, కాని దేవతామూర్తి ఇచ్చిన పువ్వుప్రభావం వల్ల శేషు మనిషిరూపం మారలేదు. అతనిలో గాంభీర్యం మరింత యెక్కువైంది. వెంటనే అతని చేతిలోని పంచపాత్రను దూరంగా ఆ రాతినేలపైని గిరగిరా విసిరికొట్టాడు తర్వాత ఆ మాయలాడిజుత్తు పట్టుకొనివంచి, "ఛీ! దుష్టురాలా! ఇక దీంతో నీ ఆయుర్దాయంసరి ;— చూసుకో! నిన్నేం చేస్తానో!" అంటూ గట్టిగా అదలించాడు.

దాంతో ఆ మంత్రగత్తె ప్రాణాలు గాలికెగిరిపోయాయి అంత భయంకరంగా తయారయింది రాజకుమారుడు శేషు ముఖం. వంటపుట్టి వెంటనే కాళ్ళకు బుద్ధిచెప్పాడు. మిగతా చెలికత్తెలంతా పిల్లుల్లాగ మూలమూలల్లో నక్కిపోయారు. ఎటుచూసినా "శరణు - శరణు" అనే కేకలే వినిపించ సాగాయి. మంత్రగత్తె మాధురి రాజకుమారుడు శేషు కాళ్లపైపడి, - "మహానుభావా! నన్ను రక్షించు. మీ రెవరో ఇప్పుడు నాకర్థమైంది. మానవుల్లో మాణిక్యానివైన మహారాజా! నన్ను రక్షించు రక్షించు, ఈనాటినుంచి నేను

నీకు బానిసను. ఈ దివ్యమయినమహలు ఇక నీదే" అంటూ వేడుకుంది. ఆమెతోబాటు చెలికత్తెలుకూడా జాలిగా ఏడవడం మొదలెట్టారు. పచ్చరంగు తలవెంట్రుకలు గలిగిన సముద్రకన్య పుష్పనీళ్ళను కడవలు కడవలుగా కార్చింది. జలకన్య మంచినీళ్లను కళ్ల వెంట ధారాపాతంగా కార్చింది. అయినా మంత్రగత్తె మాధురి గట్టి వొట్టుపెట్టుకునేదాకా వదల్లేదు శేషు. తన సిపాయిల్ని తను చూపించిన మృగాలనూ, పక్షులనూ వారి వారి మానవరూపాలకు మారిస్తేనే ఆమెను ప్రాణాలతో వదిలిపెడ్తానన్నాడు.

ఇక ఆ మంత్రగత్తె మాయలేవీ అతనిదగ్గర పనికి రాలేదుగా! అందుకని గత్యంతరంలేక అతనేం చెప్పినా దానికి తలవంచటం ప్రారంభించింది. ఇంతవరకూ జీవితంలో కనిపించిన వారందరికీ చెరుపు చేసిన ఆ మాయలాడి ఇప్పుడదే మంత్ర దండంతో మంచి పనులు చేయసాగింది. ఆమె యువరాజు శేషుని తన పందుల దొడ్డిలోకి వెంటబెట్టుకుని వెళ్లింది. దాంట్లో యెటు చూసినా పందులమయం. మరొక దొడ్లో పులులూ - సింహాలూ - తోడేళ్లూ - రకరకాల జంతువులన్నీ వున్నాయి. అవన్నీ పూర్వం మనుషులేగా! - అందుకని యువరాజు శేషు వారందర్నీ మళ్లీ వారి వారి రూపాలకు మార్చివేయమని ఆ మంత్రగత్తెకి ఆజ్ఞాపించాడు. ఆ ఫళంగా ఆమె తన మంత్రదండాన్నెత్తి జంతువులపైని ఆడించింది. వెంటనే వారంతా మానవ రూపాలు ధరించారు. యువరాజు శేషు తమకు చేసిన వుపకారానికి కృతజ్ఞతా పూర్వకంగా అతనికి సాష్టాంగపడి నమస్కరించి అక్కణ్ణుంచి వెళ్లిపోయారు.

వారితో బాటు శేషు తాలూకు అయిదుగురు సిపాయిలు కూడా వచ్చి లెంపలు వేసుకుని అతనిముందు నిలబడ్డారు. అంతేకాదు. ఇదివరకటి కోపం మనసులో పెట్టుకుని వారా మంత్రగత్తె కాళ్లూ చేతులూ విరిచి కట్టారు.

సరే! వారినీ, ఆ మంత్రగత్తెనూ వెంటబెట్టుకుని యువరాజు శేషు అక్కణ్ణుంచి బయలుదేరాడు. అంతలో 'పీప్-పీప్' అనుకుంటూ ఇదివరకటి పిట్టే మళ్లీ అతనికి ఎదురయింది. దీని వింతేమిటో, చూడాలని యువరాజు శేషు ఆ మంత్రగత్తె చేతిలో నున్న మంత్రదండాన్ని లాక్కుని ఆ పిట్టపైని అటూ - ఇటూ ఆడించాడు. దాంతో యింకేముంది!- మరుక్షణంలో ఆ పిట్ట ఒక అందమైన రాజుగా మారిపోయింది. యువరాజు శేషుకి అతను చేతులు జోడించి నమస్కరిస్తూ,- "మీ మేలు మరువలేను రాకుమారా! నేను ప్రాగ్జ్యోతిషపురం మహారాజును. నేనొక నాడు నిద్రపోతూవుండగా యెద్దురాక్షసుడు యెత్తుకుని వచ్చాడు. వాడు చెప్పిందానికల్లా తల లూపలేదని, నన్నీ రకంగా నోరులేని పిట్టగా మార్చివేశాడు. అయినా ఇప్పటికీ వాడు బ్రతికేవున్నాడు. అందుకని నేనీ రూపులో వుండడం మంచిదికాదు. వెంటనే నీ మంత్రదండ ప్రభావంతో నన్ను మాట్లాడే రామచిలుకగా మార్చివెయ్యి మిగతా సంగతి నేను చూసుకుంటాను" అని చెప్పింది.

ఆయన మాటలువిని ఆశ్చర్యపోయాడు శేషు. ఐనా పెద్దవాడు అబద్ధంచెప్తాడా తనకా దీవిలో పెద్దదిక్కు ఆయనే. తక్షణమే తన మంత్రదండాన్ని అటు ఆడించి ఒక చక్కని రామచిలుకగామార్చి, దాన్ని తనచేతిపైని ఆడించుకుంటూ

అక్కడనుంచి బయలుదేరాడు శేషు. అందరూ ఓడ యెక్కారు. ఓడకదిలి నీటిలో నడుస్తూవుంది. అప్పుడు శేషు భుజంపైనున్న రామచిలుక,-ఓయీ రాజకుమారా! ఆ దీవి ఒక మాయదీవి. దాన్ని ఆ యెద్దురాక్షసుడే నిర్మించి తన ప్రియురాలైన యీ మంత్రగత్తెను కాపలా పెట్టి వుంచాడు. ముందు ఆ మాయ దీవి పూర్తిగా భస్మమై పోయేట్టు చేయి" అని చెప్పాడు. అలాగేనని యువరాజు శేషు తన మంత్రదండాన్ని ఆడించాడు. దాంతో ఆ దీవి-ఆ మహలూ యావత్తూ పెద్దపెద్ద మంటలలో మునిగి భస్మమై పోయింది అంతేకాదు. మరి కొంతసేపటికల్లా ఆ దీవినిండా నీరు నిండి పోయింది. దీవి నీటిలో మునిగి నామరూపాలు కూడా లేకుండా పోయింది. అది భస్మమై పోవడంతో ఓడలో నున్న మంత్రగత్తె అమాంతంగా ప్రాణాలు వదిలింది. ఎందుకంటే ఆమె ప్రాణా లామహల్లోని వంటగదిలో వుండేవి. అందుకే ఆమె ఆ వంటగదిని వదిలిపెట్టి మరెక్కడికి వచ్చేదికాదు. ఇప్పుడా వంట గది కూడా భస్మమై నీట్లో మునిగిపోవడంతో మంత్రగత్తె 'అయ్యో!' అను కుంటూ ప్రాణాలు వదిలి కొండలాగ క్రింద పడిపోయింది. ఒక క్రూర స్వభావురాలు మరణించిందని ఆ ఓడలో వున్న వారంతా ఆనందించారు.

కొన్నాళ్లకు ఓడ వొడ్డుచేరింది. మళ్లీ యువరాజు శేషు, రామచిలుకతోనూ, తన సిపాయిలతోనూ కీకారణ్యం మధ్యలో పడ్డాడు. కాని సమయం మించిపోయింది. ఈ సంతోషవార్తను తన ప్రియురాలు రాముకి చెప్పాలని యెంతో ఆత్రపడ్డాడు. కాని అప్పటికే చిన్నచిన్న చీకట్లు

కమ్ముకున్నాయి. అందుకని ఆమె వుండే అంతఃపుర మహలు అమాంతంగా భూమిలోపలి కెళ్లిపోయింది అక్కడంతా పెద్ద మైదానం యేర్పడింది. యువరాజు శేషు కది యెంతో నిరాశ గొల్పింది అయినా ఏం చేస్తాడు? ఆ రాత్రియంతా ఒక చెట్టు కింద కాలం గడపవలసివచ్చింది. మంత్రగత్తె తాలూకు కొండలాంటి శవంకూడా ఆ మైదానం మధ్యను పడవేసి, తాము అల్లంతదూరంలో అలసటదీర పడుకున్నారు.

తెలతెలవార్తూ వుంది. చీకట్లుపోయి వెలుగు విరజిమ్ముతూవుంది. అంతలో యెక్కణ్ణుంచో కమ్మనిగానం వినిపించ సాగింది. ఆ తీయని గొంతు వినగానే తెలివి తెచ్చుకున్నాడు యువరాజు శేషు. లేచి చూశాడు ఆ చుట్టుపట్ల ఎవ్వరూ లేరు. కాని ఆ రాగం వినిపించేవైపు కెళ్ళి చూశాడు అదేవో పెద్దచెట్టు. దాని ఆకులన్నీ పెద్ద పెద్ద నోళ్లే — ఆ నోళ్లన్నీ కమ్మని గానాన్ని ఆలాపిస్తున్నాయి, అక్కడింకెవరూ లేరు. ఓహో! ఇదేగాబోలు పాడేచెట్టు అనుకొని మురిసిపోయాడు యువరాజు శేషు.

కాని ఆతని భుజంపైనున్న రామచిలుక, "అప్పుడే మురిసిపోకు యువరాజా! ముందున్నది ముసళ్ళపండగ. ఆ యెద్దురాక్షసుడే యీ పాడేచెట్టును పట్టుకొచ్చాడు. కాని తన ప్రియురాలు మంత్రగత్తె ఆ మైదానంపైని చచ్చిపడి వుండడం చూసి వాడు బెంగపెట్టుకుని యీ చెట్టు నిక్కడ పారవేసి ఆమె శవాన్ని తీసుకుని యేటివొడ్డు కెళ్లిపోయాడు. వాడు మళ్లీ వచ్చేవేళయింది. పైగా తెల్లవారబోతూవుంది. అంతఃపురం మళ్లీ ఇక్కడ లేస్తుంది. దాని పునాదులమధ్య నే

వున్నది ఆ రాక్షసుడి ప్రాణం. నీ ప్రియురాలైన రాము నెలాగో బయటికి రప్పించి ఆ యంతఃపురాన్ని కూడా నీ మంత్రదండ ప్రభావంతో భస్మంచేశావంటే ఆ యెద్దురాక్షసుడి పనికూడా పూర్తి అవుతుంది. అయితే చిన్నమాట దేవతామూర్తి ఇచ్చిన గులాబీపువ్వును మాత్రం నువ్వు వదలకూడదుసుమీ !- దాన్ని ఆదమరచి ఎక్కడైనా మరిచి పోతే ఆ రాక్షసుడు యెదురుమంత్రాన్ని ప్రయోగించి, నిన్ను ఇట్టే లొంగదీసుకుంటాడు. జాగ్రత్త! అంటూ హెచ్చరించింది.

మరికొంత సేపటికి భళ్ళున తెల్లవారింది. అనుకున్నట్టుగానే అక్కడ మళ్ళీ పెద్ద మహలొకటి భూమిలోనుంచి పైకి లేచింది. గభాల్న రామచిలుక ఆ మహలులోపలికెళ్ళి,—

"అమ్మాయ్ రామూ! నీకోసం యువరాజు శేషు బయట యెదురుచూస్తున్నాడు ఒక్కసారి వాకిట్లోకొచ్చి చూడు తల్లీ!" అంటూ ఎంతో ఆప్యాయంగా చెప్పింది. ఆ రామచిలుక అలా మనిషిలాగ మాట్లాడడం చూసి యెంతో ఆశ్చర్యపడింది కిల్లాడి రాము. కాని అది యెద్దురాక్షసుడి మాయయేమోనని అనుమానపడింది. అయినా నిజమో - కాదో చూద్దాంగదా అని మహలువాకిట్లోకొచ్చిచూసింది. బయట యువరాజు శేషు నిలబడి ఆమెను గబగబా రమ్మని పిలుస్తున్నాడు ఆమె పరమానందంతో బయటికి పరుగెత్తుకొచ్చింది.

ఇది కాస్తా కనిపెట్టిన యెద్దురాక్షసుడు గాండ్రు గాండ్రుమని అరుచుకుంటూ యెగిరిమరీ చూసాగాడు. ఐనా యువరాజు శేషుచేతిలో దేవతామూర్తి ఇచ్చిన రోజాపువ్వు

వుందిగా !— అందుకని ఆ రాక్షసుడు ప్రయోగించిన మాయలూ - మంత్రాలూ ఏవీ శేషుపై పనిచేయలేదు. పై పెచ్చు యువరాజు శేషు తన మంత్రదండం అటూ ఇటూ ఆడించి భూమిలోనుండి పైకొచ్చిన ఆ యంతఃపురాన్ని మంటల్లో ముంచి చిటికలో భస్మంచేసివేశాడు. దాంతో ఆ యెద్దురాక్షసుడి ప్రాణాలుకూడా గుప్పుమన్నాయి. వాడొక పెద్ద పర్వతంలాగ నేలను కూలిపోయి గిజగిజమని గింజుకుంటూ చచ్చిపోయాడు.

అమ్మయ్యా ! ఇక ఆ రాక్షసుడి పీడ విరగడయిందని యెంతో ఆనందించింది కిల్లాడిరాము. బహుకాలానికి కలుసుకున్న ప్రియుడు యువరాజు శేషుని ప్రేమపూర్వకంగా కౌగలించుకుంది. ఆ ప్రేయసీ ప్రియులిద్దరూ హాయిగా కలుసుకుని ఆనందించడానికెంతో సహాయపడిన ఆ రామచిలుకకు వారు తమకృతజ్ఞతను తెలుపుకున్నారు. అప్పుడు యువరాజు శేషు తను యింటిదగ్గరనుంచి బయలుదేరింది మొదలు అంతవరకూపడిన పాట్లూ-అగచాట్లూ సవిస్తరంగా వివరించి చెప్పాడు. తనను రక్షించేందుకు అతను పొందిన కష్టాలను ఆలకించి యెంతో విచారించింది రాము. అందుకని ఆ కష్టాలు మరపించే చిరునవ్వొకటి అతని పైకి విసరింది.

రాము 'మాట్లాడే రామచిలుక'ను తన చేతిపైకి తీసుకుని దాన్ని యెంతో ఆప్యాయంగా నిమిరింది. 'ఆహా - ఈ నాటికి నా కోరిక తీరింది ; నాకెంతో ప్రియమైన "మాట్లాడే రామచిలుక" దొరికింది. అంటూ వుప్పొంగిపోయింది.

అప్పుడు శేషు కూడా అందుకుని, "అదుగో ఆ రాక్షసుడి ధర్మమా అంటూ 'పాడేచెట్టు' కూడా తయారయింది. తెలతెల వార్తూవుంటే దాని ఆకులన్నీ నోళ్ళు విప్పుకుని కమ్మని గానాన్ని అందిస్తూవుంటాయి." అంటూ ఆమెను పాడే చెట్టు దగ్గరకు తీసుకెళ్లాడు. దాన్ని చూడగానే తన కల పండిందని ఎంతో మురిసిపోయింది రాము.

"కానీ అప్పుడే యేమయిందనీ!- ఇంకా నీ మనసులో యేదో మరొక కోరిక కూడా వుందిగా!" అన్నది మాట్లాడే రామచిలుక.

అది విని రాము మరీ ఆశ్చర్యపడింది. తన మనసులో వున్న కోరిక ఆ రామచిలుక కెలా తెలిసింది చెప్మా అని ఆలోచించింది. "అవునవును-బంగారు నీళ్ళు మాత్రం ఇంకా కనిపించ లేదు" అన్నది రాము.

అప్పటికే యువరాజు శేషు బాగా విసుగెత్తి వున్నాడు !-అందుకని-"పోనెస్తూ - దొరికినప్పు డదికూడా దొరుకుతుంది" అంటూ గొణుక్కున్నాడు.

వెంటనే రామచిలుక అందుకుని, "ఎందుకు రాజకుమారా నీకంత విసుగు ? ఆమె ఆ మూడు అపూర్వ వస్తువులూ కావాలనే గదా ఇన్నాళ్ళూ - యిన్ని అవస్థల పాలైంది. అలాంటప్పుడు వాటిని సాధించుకుని తీసుకెళ్లక పోతే లోకులంతా ఏమంటారు ? - 'బంగారు నీళ్ళు' ఇక్కణ్ణుంచి పది ఆమడల అవతల ఒక చిన్న కొలనులో వున్నాయి. ఆ కొలను దేవతలది. దేవతా స్త్రీలు వారానికొకసారి దాంట్లో స్నానం చేసి మరీ పోతూవుంటారు.

సరిగ్గా ఈవేళే వారు స్నానానికి వచ్చేరోజు. పదండి. ఇప్పుడే వెళ్లి పట్టుకొద్దాం'' అని చెప్పింది.

రాముకి తోడుగా తన సేవకుల్ని అక్కడే పాడేచెట్టు దగ్గరవుంచి తన రామచిలుకతో బయలుదేరాడు యువ రాజు శేషు, సాయంత్ర మయ్యేసరికల్లా వారిద్దరూ ఆ కొలను చేరుకున్నారు కొలనువద్ద ఇద్దరు సేవకులు కాపలా వున్నారు. వారిని యెలాగో మాయజేసి, యువరాజు శేషు రామచిలుకను కాస్త దాహంగా వున్నదని చెప్పి నింపా దిగా దాన్ని కొలను లోపలికి తీసుకెళ్లాడు. అప్పుడు చిలుక అన్నదిగదా! ''రాకుమారా! మనం ఈ నీళ్ళను దేంట్లో నయినా తీసుకెళ్తే అక్కడున్న సేవకులు పట్టివేస్తారు. అందు కని యెలాగూ నాకు దాహంగా వుందని తీసుకొచ్చావు. గనుక నేను కడుపునిండా నీరు త్రాగివేస్తాను. ఎలాగో ఇక్క ణ్నుంచి తప్పించుకుని పోదాం తర్వాత సంగతి చూసు కుందాం'' బలే! బాగుందని యువరాజు శేషు ఆ రామచిలు కను కొలనులో ముంచి కడుపునిండా నీరు పట్టించాడు. నింపాదిగా వారిద్దరూ, కాపలావారి నుంచి యుక్తిగా తప్పించుకుని బయటపడ్డారు. చీకటి పడేసరి కల్లా రాము దగ్గరకు చేరుకున్నారు.

ఇంకేం? - కావలసిన అద్భుత వస్తువులు మూడూ దొరికాయి, ఇక పదండంటే పదండని వారంతా కాళ్ళకు పనిచెప్పారు.

అప్పుడు రామచిలుక వారిని చూసి, ''ఇదుగో! చూడండి ఇలా యెన్నాళ్లు నడిస్తే మన గమ్యస్థానం చేరు

కోగలం. అందుకని నేనొక వుపాయం చెప్తాను. ఇప్పుడు పాతాళరాజు ప్రాణాలతో లేడు. యువరాజు శేషు పైని బెంగపెట్టుకుని ఎప్పుడో మరణించాడు. అక్కడి ప్రజలు యువరాజుకి బదులు ఒక ఖడ్గానికి పట్టాభిషేకం గావించుకుని రాచకార్యాలను సరిదిద్దుకుంటున్నారు అందువల్ల ఇప్పుడు మనం భూలోకంలో చేయవలసిన పనులు చాలా వున్నాయి.

కుమారి రాము తల్లి పాపం మహారాజుగారి అపనింద లకు లోనై నీలాటి రేవులో పడరాని పాట్లు పడ్తూ వుంది. రాము అన్న లిద్దరూ రాళ్ళుగా పడివున్నారు. రాము తాలూకు దొడ్డమ్మల వలలో పడి మహారాజు మతిలేకుండా ప్రవర్తిస్తున్నాడు. అందుకని మనం యివన్నీ చక్కదిద్దిన నాడే మనకు హాయి. ఇప్పుడా బంగారు నీళ్ళు త్రాగినప్పటి నుంచీ నాలో యేదో క్రొత్త శక్తి-వుత్సాహం పుట్టింది. అందుకని మీరిద్దరూ నావీపుపైని కూర్చోండి. సూతక్షంగా సుఖువుగా నేను భూలోకానికి తీసుకెళ్తాను పదండి. ” అని చెప్పింది.

యువరాజు శేషుకి తండ్రి చనిపోయాడన్న కబురు తెలియగానే పాపం యెంతో కలవర పడ్డాడు. కాని ముందు కర్తవ్యం ఆలోచించేసరికి రాముతో వెళ్లి తీరాలనుకున్నాడు. వారిద్దరు రామ చిలుకపైని కూర్చున్నారు. అది రివ్వున ఆకాశపథంలో కెగిరిపోయింది. యువరాజు శేషు తన మంత్ర దండాన్ని క్రిందికి చూపించ సాగాడు. దాని ఆకర్షణకు క్రిందనున్న 'పాడే చెట్టు' రంయిమని వారితో బాటే గాలిలో

ఎగిరి రావడం మొదలెట్టింది. ఇలా వారంతా కొన్ని పగళ్లూ-కొన్ని రాత్రులు ఎగుర్తూ ఆఖరి కొకనాడు కిల్లాడి రాము బయలు దేరిన కొండవద్దకు చేరుకున్నారు. వారా కొండపైని దిగగానే అదంతా గజగజా వణకసాగింది. రక రకాల వింత వింత గర్జనలు కూడా వినిపించ మొదలెట్టాయి. రంయ్‌మని సుడిగాలి బయలు దేరింది.

అయినా యువరాజు శేషూ, రామూ భయపడలేదు. ఎందుకంటే వారిదగ్గర మంచి మంత్రదండం వున్నది. పైగా ఏ సలహా కావాలన్నా చెప్పటానికి మాట్లాడే రామచిలుక వున్నది. ఎన్నాళ్ళనుంచో ఎందరెందరో రాజులు ఆ పర్వతం పైని రాళ్లయిపోయి వున్నారు. వారందర్నీ తన దగ్గర వున్న మంత్రదండ ప్రభావంతో మనుషులుగా మార్చాలని ఆమె అనుకున్నది. వెంటనే ఆమె మొత్తం ఆ కొండపైని కాసిని కల్లాపి నీళ్లు జల్లి మంత్రదండం దానిపై అటూ యిటూ ఆడించింది. దాంతో యిక చూసుకోండి-అంత పెద్ద పర్వత మూ గభీమని భూమిలోపల కూరుకుని పోయింది. దాంట్లో నుంచి భూతం లాంటి పెద్దభూతం ఒకటి కబంధుడిలాగ ముందుకు విరుచుకుని పడింది. అది చూసి రామూ, యువ రాజు శేషూ యెంతో గాబరా పడ్డారు. కాని రామచిలుక వారికి ధైర్యం చెప్తూ "భయంలేదు. మీ దగ్గర వున్న పువ్వును మీ ఇద్దరూ బాగా వాసన చూడండి. అది మీ యిరుపంచలకు కూడా రాలేదు" అంది.

వెంటనే యువరాజు శేషు దేవతామూర్తి తనకిచ్చిన పువ్వుని పైకితీసి వాసనచూశాడు. రాముకూడా దానివాసన

పీల్చింది. అందువల్ల ఆ భూతం ప్రయోగించిన మంత్ర తంత్రాలేవీ వారినేమీ చేయలేదు. అంతలో కిల్లాడి రాము యేంచేసిందో తెలుసా ?- తనదగ్గరవున్న మంత్రదండంతో ఆ భూతాన్ని లోబరచుకుంది. దాన్ని నెమ్మదిగా లొంగ దీసి ఒక సీసాలో బంధించి వేసింది. అలా బంధించగానే అనేకమంది రాజకుమారులు భూమిలోపలనుంచి పైకొ చ్చారు. ఆమెకు వంగి వంగి నమస్కారం చేశారు. ఆ భూతంనుంచి కాపాడి రాళ్ళుగా పడివున్న తమను రక్షించి నందుకు వారంతా తమ కృతజ్ఞతను వెల్లడించి తమ తమ రాజ్యాలకు తరలి వెళ్ళిపోయారు. వారిలో రాము అన్నలు భీముడూ - సోముడూ కూడావున్నారు. తమ చెల్లెలిని చూడ గానే వారి ఆనందానికి అంతే లేదు.

కిల్లాడిరాము ఆ భూతం సీసాని తిన్నగా తీసుకొచ్చి లోగడ తనకు దారిచెప్పి ఆశీర్వదించిన సన్యాసికి అప్పగిం చింది. ఆ సన్యాసి లేచి ఆమె భుజంపైని తట్టి "శభాష్ చిట్టితల్లీ - నిన్నుకన్న తల్లిదండ్రులెవరో గాని ఎంతోఅదృష్ట వంతులమ్మా - స్త్రీలలో మాణిక్యంలాంటి దానివి. ఈ భూతాన్ని వశపరచుకోవాలనే నేనిన్నాళ్ళుగా తపస్సు చేస్తు న్నాను అది నీ ధైర్య సాహసాలవల్ల ఈనాటికి నెరవేరింది. నువ్వు మానవులేకాదు, దేవతుల్ని కూడా జయించగల శక్తి సామర్థ్యాలు గలదానివి. అందుకే ఈనాటినుంచి నువ్వు కిల్లాడి కిన్నెరి, రామువి. నువ్వుచేసిన మేలు యేనాటికయినా తీర్చుకుంటానులే! " అని ఆశీర్వదించాడు.

కిల్లాడి కిన్నెరి రాముూ—— ఆమె అన్నలూ - యువ రాజు శేషూ ఆయనవద్ద సెలవు పుచ్చుకుని అక్కడనుంచి బయలుదేరి తమ ఇంటికి చేరుకున్నారు.

కాని విడ్డూరం! అక్కడ ఇదివరకుండే గుడిసె లేదు. దానికి బదులు గొప్ప అందమైన భవంతి వుంది. దాంట్లో నౌకర్లూ, చాకర్లూ ఎంతోమంది వున్నారు. దానిఅందాలూ అలంకారాలూ ఇక వర్ణించనే అక్కర్లేదు. కిల్లాడి కిన్నెర రాము అదంతా ఆ సన్యాసి కటాక్షమే ననుకొని ఆనందిం చింది. తను చేసిన మేలుకి ప్రత్యుపకారం చేస్తానన్నాడుగా! ఇదే నేమో !

మాట్లాడే రామచిలుక తను త్రాగిన బంగారునీళ్ళన్ని టినీ రాము వుండే రాజమహాలు తోటలోని కొలనులో విర జిమ్మింది. దాంతో ఆ కొలనంతా బంగారు నీటికొలనై పోయింది. పాడే చెట్టును తన మహాలు కెదురుగా పాతిం చింది. మాట్లాడే రామచిలుకను మహాలుమధ్య బంగారు పంజరంలో వుంచింది.

“ రాముూ ! పాపం ఈ చిలుకలోనున్న మహారాజు మనకుచేసిన ఉపకారం అంతా యింతా కాదు. ఆయనమేలు మనం యెన్నటికీ మరువలేం. ఇప్పటికయినా మంత్రదం డంతో ఆయన రూపు ఆయనకు వచ్చేటట్టు చేసి సత్కరించ డం మన విద్యుక్తధర్మం ” అన్నాడు యువరాజు శేషు.

కాని పంజరంలో రామచిలుక రూపంలోనున్న మహా రాజు; “ అబ్బె! ఇప్పుడేనద్దుబాబూ! నేను చెయ్యవలసింది

యింకా చాలావుంది. అందుకని కొన్నాళ్ళపాటు ఇలాగే వుండనివ్వండి" అన్నాడు.

ఇలా వారంతా ఆమహల్లో ఆనందంగా కాలం గడుపు తున్నారు. రాము అన్నలయిన భీముడూ, సోముడూ చిలుక చెప్పిన సలహా ననుసరించి మహారాజుగారి కొలువులో ఉద్యోగాలు సంపాదించుకొని పనిచేస్తున్నారు.

ఒకనాటి ఉదయం- తెలతెలవార్తూవుండగా మహారాజు మదనసింహుడి చెవికేదో మధురసంగీతం మేలుకొలిపి నట్లయింది. మహారాజు కళ్లు తెరచి చుట్టూ చూశాడు. ఎవరూ లేరు. ఏమిటిచెప్మా యీ విడ్డూరమని ఆయన గబగబా బట్టలు వేసుకుని గుఱ్ఱంపైనెక్కి ఆ పాట వినిపించే వైపుకి బయలుదేరాడు. అలా వెళుతూ వెళుతూ నగరం దాటి, నదిని దాటి వెళ్ళాడు. వూరి పొలిమేరల్లో అతనికొక అందమైన రాజమహలొకటి కనిపించింది. అదివరకు లేని అంతఃపురం అక్కడెలా వచ్చిందో చెప్మా అని మహారాజు మదనసింహు డాశ్చర్యపోతూ అటు వెళ్ళాడు. అప్పుడే ఆ మహాలుపైని యెవరో ఒక అందాల సుందరి స్నానంచేసి తల విరియబోసుకుంటూ వుంది. ఆమె అంద చందాలు చూడగానే మహారాజు మరీ ఉగ్భ్రాంతుడైపోయాడు. 'ఆహా! యెంత సొగసుగా వుంది ! ఆమె మానవ మాతృగాలు కాదు. ఎవరో ఆకాశం నుంచి దిగి వచ్చిన అప్సరస అయి వుంటుంది' అని మహారాజు తనలో మురిసి పోయాడు. అంతేకాదు ఆమె నెలాగైనా పెళ్ళి చేసుకోవాలని నిశ్చయించుకున్నాడు.

ఆ సుందరి ఇంకెవరో కాదు. కిల్లాడి కిన్నెరిరాము! ఆయన కామె కూతురని గానీ, ఆమెకి అయన తన కన్న తండ్రి అనిగానీ తెలియదుగా! ఆమె అన్నలకి కూడా ఆ రహస్యం తెలియదు మరి!. ముసలిరాజుతో తనకు పెళ్ళి వద్దని ఖచ్చితంగా చెప్పింది రాము. ససేమిరా చేసుకుని తీరాలని పట్టుపట్టారామె అన్నలు; మంత్రులూ, సేనా పతులూ-సామంతులూ - అందరూ వారికప్పుడే సలాములు కొట్టడం మొదలెట్టారు. మహారాజు వియ్యమందబోయే ఆ మహా భవనం వందిమాగధులతో వైభవాలతో కళకళ లాడ్తూ వుంది. కాని రాము కన్నీరు మున్నీరుగా ఏడవ సాగింది.

ఇక మూడు రోజులే వుంది పెళ్ళికి-పంజరంలో నున్న రామచిలుక భీమున్ని, సోమున్ని పిలిచి ఆవేళ మహారాజుని తమ ఇంట్లో భోజనానికి ఆహ్వానించమని చెప్పింది. వారిద్దరూ అలాగే ఆహ్వానించారు. అప్పుడు చిలుక రామూని పిలిచి - "అమ్మాయ్! మహారాజుగారు విందుకొస్తున్నారు గనక వంటవాళ్ళమీద పెట్టక నువ్వే వంటలన్నీ చెయ్యి. మంచి దోసకాయలు వండి వాటినిండా ముత్యాలు పోసి ఒక తట్టలోనుంచి అన్నిటికన్న ముందు వాటిని వడ్డించు. మిగతా వ్యవహారం నేను చూసుకుంటాను. అయితే అన్ని ముత్యాలెక్కడ దొరుకుతాయని అనుమానిస్తున్నావేమో! మన తోటలో గుడి పక్కనున్న చెట్ల మొదళ్లలో తవ్వితే నీకు కావలసినన్ని ముత్యాలు దొరుకుతాయి" అని చెప్పింది.

వెంటనే రాము ఒక గడ్డపారను తీసుకెళ్ళి రామ చిలుక చెప్పిన చెట్టు మొదలు తవ్వింది. కొంతసేపు త్రవ్వగా త్రవ్వగా ఆమెకొక పెద్దబంగారు పెట్టె భూమిలో దొరికింది. ఆ పెట్టెనిండా ముత్యాలే! ఆ ముత్యాలను లోపల పెట్టి మంచి గరం గరం దోసకాయలు వండింది రాము.

మహారాజుగారు విందుకు వచ్చారు. ఆయనతో మంత్రీ, సేనాపతీ, భీముడూ, సోముడూ, యువరాజు శేషూ, సమస్త పరివారమూ వున్నారు. వారి ఆనందంకోసం పెరటి లోని గానవృక్షం కమ్మ కమ్మని పాటలు పాడసాగింది. వారంతా ఆ చెట్టు దగ్గరకెళ్లారు. ఆ విడ్డూరం చూసి ఆశ్చర్యపోయారు. భీముడూ, సోముడూ వారికింకా బంగారు నీటికొలనూ, మాట్లాడే రామ చిలుక మొదలైనవన్నీ చూపించారు. వాటిని తమ చెల్లెలు రామూయే తన సామ ర్థ్యంతో సంపాదించి తెచ్చిందని మహారాజుకి మనవి చేసు కున్నారు ఆయన తనకు కాబోయే అర్ధాంగి అంతటి సమర్థు రాలా అని నిర్ఘాంతపోయాడు.

అందరూ భోజనాలకు కూర్చున్నారు. రామచిలుక సలహాప్రకారం రాము ముత్యాల దోసకాయలను మహారాజు గారికి మాత్రం వడ్డించింది. ఆయన దోసకాయలు బాగా వున్నాయని వాటిని తీసుకుని తినేసరికి వాటిలోనుంచి ముత్యాలు జర్రున ఒలికాయి. మహారాజు నిర్ఘాంత పోయాడు. "ఛీ తినే దోసకాయల్లో అమూల్యమైన ముత్యాలు పోయడమేమిటి?" అంటూ కోపంగా చూశాడు.

అప్పుడు పంజరంలో నున్న రామచిలుక బిగ్గరగా అన్నది గదా - "మహారాజా! కాస్త మీ కోపం తగ్గిం

చండి. దోసకాయల్లో ముత్యాలు పోసి వుండడం మీరు ప్రత్యక్షంగా చూసికూడా విస్తుపోతున్నారు గదా! మీ ఇల్లాలు కుక్కను - పిల్లిని - కొరకంచునూ కన్నదని చెప్పితే దాన్నెలా నమ్మారు స్వామీ! - అలాగే ఇదీను".

అదేమిటో వివరంగా చెప్పమని మహారాజు ఆ చిలుకను కోరాడు.

"ఎల్లుండి నువ్వు పెళ్లిచేసు కోబోతున్న అందాల రాణి ఎవరో తెలుసా? వెర్రిబాగులరాజా - నువ్వు కన్న కూతురయ్యా! కన్నకూతురు. 'కిల్లాడి కిన్నెరి రాము' ఆమె:- తండ్రి కూతుర్ని పెళ్లి చేసుకోవడం చరిత్రలో ఇదే నేమో!- కాలం ఎలామారి పోయిందో చూశావా? భీముడూ, సోముడూ, నీ కుమారులే!" అంటూ వేళాకోళం చేస్తూ చెప్పింది రామచిలుక. ఇదంతా వింటూ ఉంటే మహారాజు మదనసేనుడి తల గిర్రున తిరిగి పోతున్నట్టయింది. కళ్లూ భైర్లు కమ్మాయి. అది కలా-నిజమూ అని తనను తనే నమ్మలేక పోయాడు. "అయ్యో! ఎంతపని చేశాను. నా చిట్టి తల్లీ!" అంటూ కెవ్వున కేకవేసి మూర్ఛ పోయాడు.

ఆ ఫళంగా అందరూ ఆయనకి వుపచారాలు చేశారు. కాస్సేపటి కాయనకు తెలివి వచ్చింది. చుట్టూ చూశాడు. తన కూతురు రాము, కొడుకులు భీముడూ, సోముడూ, కన్నీరు మున్నీరుగా యేడుస్తున్నారు. మహారాజు గభాల్న వారిని కౌగలించుకుని కన్నీరు కార్చాడు.

వెంటనే మహారాజు తన కూతురు రాముని పంపించి కైదులో అష్టకష్టా లనుభవిస్తున్న మహారాణిని విడిపించుకొ

రమ్మన్నాడు. రాము తక్షణం గుర్రంపైని వెళ్ళి తన తల్లికి తనను పరిచయం చేసుకుని ఆమె చెర విడిపించి తీసుకొచ్చింది. మహారాజు మదనసేనుడు కంట తడిపెట్టి తను చేసిన అపరాధాన్ని మన్నించమని వేడుకున్నాడు. మహారాణి ఆయన్ని ఓదార్చి తన కూతుర్నీ, కొడుకుల్నీ అమందానందంతో తన అక్కున చేర్చుకుంది.

మర్నాడే మహారాజు దుష్టబుద్ధి గలిగిన చిన్న రాణులిద్దర్నీ విచారణ జరిపి వారిని బహిరంగంగా ముక్కముక్కలుగా కోసి కాకులకూ గ్రద్దలకూ ఎగుర వేయించాడు.

భీముడూ – సోముడూ ఇప్పుడు మహారాజు కుమారులు. అందుకని వారి పేర్లు భీమరాజూ, సోమరాజూ అని పెట్టారు. మహారాజు ముసలివాడైపోయి నందువల్ల తన కుమారులకు పట్టం గట్టాలని నిశ్చయించాడు.

కానయితే, అంతవరకూ రాజుగారికి వారసులెవరూ లేనందువల్ల రాజ్యాన్ని కాజెయ్యాలని పన్నాగాలు పన్నుతున్న సేనాపతి సమరసింహుడికది కంటకమయింది. అందుకని ఒకనాటి తెల్లవారుఝామున అతను మహారాజుగారూ, భీమరాజూ, సోమరాజు నిద్రిస్తూ వుండగా మంచాలతోనే వారిని మోసుకుపోయి ఎవరికీ తెలియనిచోట బంధించాడు సమరసింహుడు. సేనలన్నిటినీ లోబరచుకుని, తనే మహారాజుగా ప్రకటించుకున్నాడు.

అమ్మాయి రాము మళ్ళీ ప్రమాదంలో పడిపోయింది. ... చెయ్యడమో పాలుపోలేదు. మరొక గడియలో సేనా... సమరసింహుడి సైన్యం తనను కూడా బంధించడానికి

రాకపూనదు. ఆమెకేమీ అర్థంకాక రామచిలుకను సహాయ మడిగింది. రామచిలుకకుకూడా ఆ క్షణంలో ఏంచెయ్యాలో అర్థకాలేదు. అప్పుడు రాము తను కొండభూతంనుంచి కాపాడిన రాజకుమారుల్ని తలంచుకుని. "రండి ఆపదలోవున్నాను రక్షించండి" అంటూ వేడుకుంది. ఇంకేముంది? మరుక్షణం లోనే వేలాది రాజకుమారులు కత్తులతో - కఠారులతో తయారై పోయారు. వారికి నాయకత్వం వహించి కిల్లాడి కిన్నెరి రాము సేనాపతి సమరసింహుడి పైని యుద్ధం ప్రకటించింది.

రెండురోజులపాటు రెండుసైన్యాలకూ ఘోరమైనయుద్ధం జరిగింది. దాంట్లో సేనాపతి సమరసింహుడితలను తనకత్తి కెర జేసింది. రక్తపు మడుగులో గిలగిల గింజుకుంటూ చచ్చిపోయాడు సేనాపతి. దాంతో అతనికి మద్దతు నిచ్చిన సైన్యాలన్నీ చిటికెలో చెల్లాచెదరై పోయాయి.

అంతవరకూ అల్లకల్లోలంగా వున్న ఆ రాజ్యంలో శాంతి ఏర్పడింది. రాము తన తండ్రినీ, అన్నలనీ విడిపించి తీసుకొచ్చింది. భీమరాజూ, సోమరాజులకు పట్టాభిషేకం వైభవంగా జరిగింది. రాము సన్యాసిని తలంచుకుని అయన కటాక్షంవల్ల రామచిలుకను మామూలు మహారాజుగా మార్చివేసింది. ఆయనెవరో కాదు. యువరాజు శేషు మేనమామ ప్రాగ్జ్యోతిషపురం మహారాజు. ఆయనా. మదనసేన మహారాజూ వియ్యంకులయ్యారు. రాముకీ యువరాజు శేషుకి వైభవంగా పెళ్ళి జరిగింది. 'కిల్లాడి కిన్నెరి రాము' చేసిన సాహసాలు నాటికీ, నేటికీ చిరస్మరణీయంగా నిలిచి పోయాయి.



KILLADI KINNERI RAMU. BC. Rs. 1-

| | | |
|---|---|---|
| మహాస్థాన్ | చలం | 5-00 |
| ఆత్మార్పణ | చలం | 2-50 |
| అనసూయ | చలం | 2-25 |
| బుజ్జిగాడు | చలం | 1-50 |
| తిరిగిరాలేదు | కె. లింగరాజు | 2-25 |
| విరుద్ధ ఫలితాలు | ముద్దంశెట్టి | 2-00 |
| బృందావనం | పురాణం | 1-50 |
| తారకమంత్రం | కవులూరి | 1-00 |
| కాంతికిరణం | దిలీప్ | 1-75 |
| పావురాలు | సభా | [illegible] |
| ప్రియురాలు | బి. వి. నరసింహారావు | [illegible] |
| బాలలోకం | బి. వి నరసింహారావు | [illegible] |
| రక్తసంబంధం | లింగంనేని | [illegible] |
| ప్రియురాలు | పి. వి. రత్నం | [illegible] |
| హర్షధ్వనులు | పి. వి. రత్నం | [illegible] |
| స్నేహితులు | ఎస్. గిరి | 0-75 |
| సాహిత్య రత్నాలు | పి. వి. రత్నం | 1-50 |
| కిల్లాడి కిన్నెరిరాము | బాజ్జీ | 1-25 |
| హాతింతాయి కథలు | బాజ్జీ | 2-50 |
| రష్యాదేశపు జానపద కథలు | బాజ్జీ | 2-25 |
| తాతా మనుమడు | కాశీవిశ్వనాథం | 0-75 |
| అమ్మా కొడుకు | కాశీవిశ్వనాథం | 1-25 |
| బిస్కెట్లు | కాశీవిశ్వనాథం | 0-50 |

ప్రజా ప్రచురణలు
పవరుపేట - ఏలూరు.




MUMUKSHUVU PRESS, ELURU.



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLAIDSB138 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CT, BCT, 194 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | pragathi |
| పేజీలు విడదీసినది | pragathi |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | No |
| పరిస్థితి | Good |